శ్రీరస్తు.

# సత్యభామాపరిణయము.

(లేక)

## నీలాపనిందాపరిహారము.

అను

## ఆంధ్రనాటక ప్రబంధము.

---

ఇది


నూజవీడు సంస్థానపండితుఁడును

సంస్కృతాంధ్రకవితావిచక్షణుండును నగు

వింజమూరి - వీరరాఘవాచార్యునిచే


రచియింపఁబడి

శ్రీమత్పనప్పాకము - అనంతాచార్యులు

హానరబిల్ విద్యావినోదిగారి యాజ్ఞానుసారంబుగ

శ్రీవైజయంతి పత్రికయందు

ప్రకటింపఁబడియె.

---


చెన్నపురి:

శ్రీ "వైజయంతీ"ముద్రాక్షరశాల న్ముద్రితము.

---

౧౮౯౭.

# పీ ఠి క.

శ్రీమన్నారాయణుని దివ్యలీలావతారంబులయందు ముఖ్యముగ నెన్నఁబడు శ్రీకృష్ణుని దివ్యగుణములలో నుత్తమంబుగ నెన్నఁబడు మి ధ్యాభిశస్తినివారణమున జాంబవతీ సత్యభామలయొక్క వివాహములు కలిగి యున్నవి. వారిలో ముఖ్యముగ నెన్నఁబడు నామె సత్యభామ యగుటచే సత్యభామాపరిణయమని పేరుపెట్టఁబడియె. మఱియు నీలాపనిందాపరి హారమని యింకొక నామంబుంచఁబడినది. నీలాపనిందయనఁగా నిజము గాని నిందమోపఁబడి నివారింపఁబడినది గనుక నీలాపనిందాపరిహార మని చెప్పనగు. నీలిమందు వండునప్పుడు నీలిపేరుకొననప్పుడు అద్భుత మైన కొన్ని మాటలను ఊరక వాడుకచేయుదురు. వానికి నీలవార్తలని పేరు. నీలమనఁగా నీలిచెట్టు. తత్సదృశమగు నిందమోపఁబడుటంజేసి నీలాపనిందయనఁ జెప్పెడు. తత్పరిహారము కావున నీలాపనిందాపరిహా రము అనునది సార్థకమయ్యెను. ఈ కథ ప్రతిసంవత్సరమునవచ్చు వినా యకచతుర్థీదినమునందు నీలాపనిందలు కలుగకుండునట్లు సత్రాజిదుపా ఖ్యానము చదువుదురుగావున రెండవపేరు ప్రసిద్ధ్యర్థముంచఁబడినది కా వున విద్వాంసులెల్లరు పరికించి మన్నించుదురుగావుత.

ఇట్లు విద్వజ్జనవిధేయుఁడు

వింజమూరి - వీరరాఘవాచార్యులు.

శ్రీహయగ్రీవాయనమః.

# సత్యభామాపరిణయము.

(లేక)

## (నీలాపనిందాపరిహారము.)

---

నాంది॥ శ్లో॥ యన్నామస్మరణేగజాననగురుశ్శ్రీస్థంపదంప్రాప్తవాన్।
యన్నామామృతమభ్యుదీర్యగిరిజాలేఖేపతింశంకరం।
యన్నామ్నైవగజాననఃప్రభురభూద్విఘ్నవ్రజానాంసదా।
తన్నామ్నాప్రణమామిభక్తసులభంలక్ష్మీపతింసర్వతః॥

అపిచ,

శ్రీనారాయణమస్త్రిరాజపఠనాత్తీర్థవ్రజస్నాతకో।
భూయాయిత్యుపదిశ్యసూనుమకరోద్యస్తాదృశంతత్పరః।
యేనస్వాతనయాకృతావధిపతీవిఘ్నౌఘదేవౌఘయో।
స్తంచిత్తేకలయామిపుష్కరసరిద్ధారాధరంశంకరం॥

నాంద్యంతే సూత్రధారః॥

[నాందియనంతరమున సూత్రధారుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

సూత్రధారుఁడు—ఓహోహోహో సభాసదులారా! నిఖిలోదధివేలావలయితసర్వోర్వరాలంకారభూతయు, నఖిలాండకోటిబ్రహ్మాండనాయకహర్యర్చాధిష్ఠితయుఁ, జతుర్ముఖపంచముఖసహస్రముఖాద్యఖిలదేవతాపూజ్యమానయు,నిక్ష్వాకుకులధనంబును నగు శ్రీరంగనాథ దివ్యక్షేత్రంబునందుఁ బవిత్రప్రదేశంబున సంగతులై యధ్యాసీనులగు సమస్తదేశాగతమహావిద్వాంసుల సమాదేశంబుచే నీవాసరంబున భగవచ్ఛ్రీకృష్ణదేవతముచేఁ బూర్వంబున నొనర్పంబడిన నీలాపనిందాపరిహారంబను వృత్తాంతంబు రూపకంబుగ నభినయింపనాజ్ఞాపితుండనైతిని. ఆహా! ఏమినాభాగ్యము? నేను జన్మప్రభృతి నభ్యసించిన రూపకవిద్య సార్థకంబుగాఁగ సకలకళావిశారదులగు పండితోత్తములెల్ల నానందింప శివకేశవవృత్తాంతములుగల యీయభినవరూపకమున నామోదించు భాగ్యము నేటికి లభించినది నాకు మిగుల సౌభాగ్యకాలముగదా!

(అనుచుండఁగా నటుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

నటుఁడు—ఆ॥ వె॥ ఓయిసూత్రధార! యూరకుండక నీకు। బలుప్రగల్భములనుబలుకఁదగునె!
నేనులేనిచోటనీప్రగల్భములన్ని । ఇంకనూరకుండు మేమియనక॥
వినుము.
తే॥గీ॥ నీవునొక్కఁడవేవచ్చినిలిచితివుడు। బహువిధంబుగవలయుసంభారసంతతి
పాత్రపురుషులెలేనిచోఁబ్రౌఢమైన । రూపకంబెట్లురూపింపనేర్పుగల్గు॥
ఓయి సూత్రధార! నీవు చుట్టుపట్ల పదియామడదూరమున నెవ్వరును విద్వాంసులు లేకున్న యజ్ఞమునైనఁ జేయింప సాహసించెదువాఁడవుగాఁ దోఁచెడిని. ఈకూడిన సామాజికులెట్టివారనుకొంటివో విసుము.
శా॥ తర్కాతర్కవిశారదుల్వివిధశబ్దాశబ్దనిష్ఠుల్కథా।
మార్కండేయులుకావ్యనాటకవిదుల్మంత్రార్థవేత్తల్వివే।
కార్కద్యోతనిరస్తపామరజనాఘాంధంతముల్చిత్తసం।
పర్కాధీతసుగానవిద్యులనిసంభావింపవోవీరలన్॥
సూ—తే॥గీ॥ ఇట్టివిబుధోత్తములకృపయెపుడుగలిగె। నప్పుడే నేర్తుభావంబులరసితెలియ।
నిహపదార్థంబులిచ్చెదునీచరిత్ర । మీదెపాత్రలవిబుధులహృదయమెఱిగి॥
నటుఁడు—సూత్రధార! “ నీవు వైదేశికుండ వగుటవలన నీకెటు సామాజికాహ్లాదకరంబుగ సాధన సంపత్తిచేకూరు ? ”నని యంటిని.
సూ—కం॥ సర్వజ్ఞులకిష్టముగా । నుర్వరఁగలజనములెల్లనుండిరయేనిన్।
సర్వవిధములగునాపద । లుర్విసమసిపోయిశుభములొందవెవారిన్॥
కావునఁ బాత్రసంపాదనకేమియు నాయాసము గలుగదుసుమీ.
నటుఁడు—కం॥ నిందాపరిహారంబై । పొందొందినరూపకంబుపుడమింగలదే!।
యందమునుజెందకుండిన । నిందలునీకగునోగాదోనేర్పుగఁగనుమీ॥
మహావిద్వాంసుండెవ్వండైన నట్టిరూపకం బభినయింపఁజేయకున్న నీవ పూని యూరక హాస్యాస్పదుఁడ వగుదువు ; అట్టిది యెద్దియైనఁ గలిగియున్నచో నభినయంబు రూపింపఁ దలకొనుము.

సూ—(ఆకాశమునఁ జెవియొగ్గి జ్ఞాపకమువచ్చినట్టు లభినయించి) మారిష! వినుము. అట్టి రూపకంబు జగంబునఁ బ్రసిద్ధంబైయున్నది. నీవు వినలేదా! చెప్పెద నాలకింపుము.
సీ॥ భువికాశికాక్ష్వయాంబుధిశశివేదాంతవిజయధ్వజాంకితాన్వితమహాను।
భావుల్యలవంశసంభవులగువీరరాఘవకవిచంద్రుచేఁగథితమైన।
శ్రీసత్యభామాఖ్యసీమంతినీపరిణయమనుసరసమానాటకమునవ।
లోకాపవాదవిలుంఠనమెల్లవిస్ఫుటముగఁగనుపట్టుసారిదినీక।

థాప్రపంచంబు పెద్దలందఱును సుప్ర । బంధముగ వాడుచుండి రిప్పట్లనదియు।
దృశ్యనాట్యప్రబంధమై తేజరిల్ల । బహుళపుణ్యఫలముల కాస్పదముగాదె॥

(ఇట్లనుచుండఁగా తెరలో బిగ్గరగా) వర్షర్తును గూర్చి—

మత్తకోకిల॥ చాతకంబుల డప్పిదీరెను శంబరంబు మరీచికన్।
బోతమానె ఘనంబులంతట మూసె భాస్కరుఁ గప్పి బల్।
వాతతాపములారెఁ జక్కఁగ వానలోకము నిండెసం।
జాతసస్యకయయ్యె మేదిని సర్వతోముఖభాసియై॥

ఆ॥వె॥ ప్రమథపురుషులార! పార్వతీదేవితోఁ । గలసిజూదమాడఁ గాంక్షగలిగి।
ఇందుధరుఁడు వీఁడె యేతెంచుచున్నాఁడు । మందిరంబు చక్కపఱుపఁ జనుఁడు॥

నటుఁడు:—(వినుపించుకొనక) సూత్రధార! నీ పేర్కొనిన విద్వాంసుఁ డుదయించిన వంశంపు వారలు బలుదండివారలుగా నున్నారు.

కం॥ అనిశము వేదాంతంబులఁ । గనుచున్భగవంతు మహిమఁ గాంచెడువారల్।
అనభిజ్ఞుల క్రియరూపక ।మునకుర్ బాల్పడుదురేని మోసముగాదే!॥

కం॥ వారే క్రియరూపకవి । ద్యారూఢిం దేలినారు దైవతభక్తుల్।
వారల కో నీకవివరుఁ । డేరీతి నిరూపకంబు లిచ్చఁ దవిల్చెన్!॥

అదియునుంగాక వేదాంతవిద్యావిచక్షణు లొనరించిన రూపకంబున విభావానుభావసంచారీభావంబులును, నవరసస్థాయీభావంబులు నెట్లునిల్చును! వైరాగ్యవంతులకుఁ జమత్కారంబు లెక్కడివి! శ్రీమన్నారాయణుల కనన్యార్హభక్తులగు నీకవివరులు పార్వతీ, తత్పతి, గణపతిస్కంధుల నెట్లు స్తుతించెదరు! నీవు చెప్పినదంతయు ననృతంబుగ దోఁచెడిని.

సూ—కాదు, కాదు. నానావిద్యావిశారదులు సకలకళాసామర్థ్యదర్శకులగుదురుగాదే! చూడుము. సర్వతంత్రస్వతంత్రులు, కవితార్కికసింహులు, వేదాంతాచార్యులు, అను బిరుదాంకముల నొందిన శ్రీవేంకటేశకవిసార్వభౌములు కామాదుల స్తుతించుచు సంకల్పసూర్యోదయంబను నవనాటకంబు రచియించిరి. అది వారికి భగవద్గుణానుభవముతోడ నేకీభవించినది. అట్లే వీరికిని భగవచ్ఛ్రీకృష్ణదివ్యగుణానుభవమున నేర్పడినది. కావున నిది వీరరాఘవకవినిర్మితంబనుటకు సందియంబించుకైనను లేదు. వీరిదిగాక "శ్రీరామజనన" "పారిజాతాపహార," "రుక్మాంగదచరిత" "శ్రీహర్షనైషధ" ప్రభృతులగు నాటకంబుల రచియించియున్నారు.

(మరల తెరలో)

ఆ॥వె॥ ప్రమథపురుషులారపార్వతిదేవితోఁ । గలసిజూదమాడకాంక్షగలిగి।
ఇందుధరుఁడు వీఁడె యేతెంచుచున్నాఁడు । మందిరంబు చక్కపఱుపఁ జనుఁడు॥

నటుఁడు—సూత్రధార! పార్వతీపరమేశ్వరలిరువురు క్రీడామందిరంబుఁ బ్రవేశించు గానము వినఁబడుచున్నది. మనము ననంతరకార్యములకేగుదము రమ్ము. [అనగానిరువురు నిష్క్రమించుచున్నారు.]

(ఇది ప్రస్తావన.)

[అనంతరము చండీశుఁడును మఱిమువ్వురును బ్రవేశించుచున్నారు.]

(ఒకఁడు వానిసేనాధిపతి ఇద్దరు ప్రమథులు)

చండీశుఁడు—ఓహో ప్రమథపురుషులారా! శంకరుండు శాంకరీసహితుండై ద్యూతక్రీడా వినోదార్థము విచ్చేయఁబోవుచున్నాఁడు. అలంకరించితత్క్రీడామందిర పరిసరంబున నుండుఁడు.

ఇరువురు—మహాప్రసాదము. (అని నిష్క్రమించిరి.)

చండీశుఁడు—సేనాధిపా! ఖండపరశుమార్తాండుం డొక్కఁడే నేఁడు మృడానీమహాదేవివారికడఁ గొంతవడి ద్యూతక్రీడసల్పి పిమ్మట నాఖేటఖేలనాయత్తచిత్తత నటవికి విచ్చేసెదరు. కావున నీవును నాటవికానీకంబులఁ దదనురూప సంభారంబులతో సన్నద్ధులగు నట్లొనర్పుము.

సేనాధిపతి—స్వామి! మీయాజ్ఞశిరసావహించెద. (నిష్క్రమించుచున్నాఁడు.)

చండీశుఁడు—ఎవరక్కడ?

[భటుఁడు ప్రవేశించి.]

భటుఁడు—అయ్యా! వీఁడే భృత్యుఁడున్నవాఁడు.

చండీశుఁడు—ఏమిరా ద్వారవార్తలు?

భటుఁడు—స్వామీ! కక్ష్యాంతరంబుల విజ్ఞాపనాసక్తచిత్తులై యేకాగ్రచిత్తత నతికలకలంబు లొనర్చుచు నేరోయున్నవారు; అందేరేని సురాసురముఖ్యులుండనోపుదురు; ఎద్దియో విన్నవింప ద్వారపాలకుఁ డేతెంచుచున్నాఁడు.

[ద్వారపాలకుఁడు ప్రవేశించి]

ద్వారపాలకుఁడు—జయజయ చండీశప్రభుమార్తాండా! జయజయ.

చండీశుఁడు—ఏమిరా? విశేషములు?

ద్వారపాలకుఁడు—మహాప్రభో! ఇంద్రవరుణధనదయమాది దిక్పాలురెల్లరు గరుడగంధర్వయక్షచారణ సిద్ధసాధ్యకిన్నరకింపురుషాదులును మూడుకన్నులదేవరకెద్దియో విన్నవించుటకుగావచ్చి యున్నుగ యుష్మదీయదర్శనాకాంక్షులై మోసలకడనుండి తమరాక దేవరకెఱింగింప నన్నుఁ బుత్తెంచినారలు. పిమ్మట దేవరచిత్తంబుకొలఁది.

చండీశుఁడు—ఇప్పుడు చండీశుఁడు పరమేశ్వరక్రీడాసాచివ్యంబుననున్నవాఁడు; మీవచ్చిన పని యెఱింగియుఁ నతిద్రుతతరకార్య నిర్వహణచణజనప్రణయనభరంబు నగుటంజేసి, మీలోఁ మచ్చటింప నిచ్చఁగొలుపకున్నాఁడు; ధూర్జటి యాఖేటఖేలనానంతరమ్మున మీ శుభియోగంబుల నెల్ల విజ్ఞాపింపఁదలఁచియుయ్యెడు; అందనుక మీమీయిమ్మల నుండుఁ డని యా నియోగంబుగఁజెప్పుము.

(ఇంతట తెరలో)

జయ ! మృత్యుంజయ ! పురంజయ ! జయజయ.

క్రీడామందిరంబు మార్గంబిదె, ఇదె : విచ్చేయుఁడు

భటుఁడు—ఆర్యా ! మహానుగ్రహము (అని నిష్క్రమించవలెను)

చండీశుఁడు—నేనును గ్రీడామందిరనికటంబున సన్నిహితుండనయ్యెద.

(అనినిష్క్రమించవలెను.)

[అంతటఁ బార్వతీపరమేశ్వరులును నందీశ్వర భృంగీశ్వరులును ఇడావతీకళావతులును ప్రవేశించుచున్నారు.]

పార్వతి—ప్రాణనాథ ! దేవరవారి యనుగ్రహమున నేకద ? మీకు సతినై యఖిలదేవతాంగనలలో నగ్రగణ్యనైయుంటిని. ఇదియునుంగాక కామవిరోధులగు మీకు నాయందుఁ గాముకత కలిగియుండుట యద్భుతమైయున్నది. అఘటితఘటనానైపుణులగు మీకు నెద్దియు నసాధ్యంబు లేదుగదా ? భక్తపరాధీనులగు మీకు మాబోఁట్లయందు ననురాగంబుకలిమి యబ్బురంబుగాదు.

పరమేశ్వరుఁడు—ప్రేయసీ ! నీ చెప్పినయట్ల నీ ప్రాపున నేకదా కామునిం గెలిచితి? నీసన్నిధి లేకున్నచో నే నెట్లు కాముంగెలువ నోపుదు? ఇంతియేల? నీ చిన్నారి నెమ్మోముం గన్న వెన్నెల రేనింగూడ గెల్చితి ; నీదులలాటంబుఁజంబు కలిమిని బాలచంద్రుం దలధరించితి ; నీయూరుసౌరున కెనయగు ననుమోదంబునఁ గృష్ణభుజంగంబుల నొడలెల్ల ధరించితి ; నీవియోగంబుననగు నవ్విరాళికాఁక కోర్వక గంగాధరుండనైతి ; నీ నేత్ర కువలయారవిందంబులకు సంకోచవికాసంబులు గలుగకుండునటుల సూర్యచంద్రుల నేత్రంబులుగ ధరించితి ; వేయేల ? నీదుప్రాపు గలిమిని గామునిసర్వబలంబులం గెల్చితిని ; నీదు కటాక్షాంచలవీక్షణంబులను సుధారసాసారములవలన విషఁబుజయించి శ్రీకంఠుండనైతి ; ప్రియసఖీ ! యీమాటలు నిక్కమనినమ్ముము.

పార్వతీదేవి—జీవితేశ్వర ! తమకు సహజంబులైయున్న లోకోత్తరగుణంబులఁ గరుణాతిశయంబునంజేసి, నాపైనన్వయింపుచున్నారు ; సర్వజ్ఞులగు తమయెదుట నే నేమని విన్నవింపఁ గలదానను ?

పరమేశ్వరుఁడు—లలనామణీ! నీవు సర్వమంగళవగుటచే నిన్నుం జెట్టపట్టి నేనును సర్వజ్ఞుండన నెగడినవాఁడ.

భృంగీశ్వరుఁడు—స్వామి! లోకశంకర! మీయిరువుర కారుణ్యంబున సర్వజయమంగళంబులును జగంబులకగుఁగాక.

పార్వతి—ప్రాణనాథ! యుక్తిప్రతియుక్తుల మిమ్ముం గెలువ నెవ్వరితరంబు? జగంబులన్నియు మీలీలకుం బాత్రంబులుగదా? విధేయురాలి విన్నపంబొక్కటియున్నది. దానింగాదనక తమరనుగ్రహింపవలయును.

ఇడావతి—కళావతీ! దేవేరియొక్క విజ్ఞాపనంబు ద్యూతక్రీడార్థంబని తోఁచెడు. సారెలు నక్షంబులు నెత్తంబుపలుకయు సిద్ధముగనుంచుమా? ఎప్పుడు కనుసన్నయగునో?

కళావతి—సఖీ! నేనిదివఱకె సర్వమును సిద్ధముగ నుంచినదాన.

ఇడావతి—చెలీ! నీవు కళావతివి గద? నీ నామంబున కనుగుణంబుగ నున్నదానవు. వేఱె పెఱవారలు చెప్పనేల?

పరమేశ్వరుఁడు—వనితా! నీకోరినకోరిక యెద్దియో యద్భుతంబుగఁగన్పట్టెడిని; నీకోరికఁదీర్చుటయే నాకు వ్రతంబైయుండ నేఁడేమోవింతఁగ నుడువుచున్నదానవు; లీలావినోదంబును నీచూడ్కి సూచనచేయుచున్నది; నీకోర్కి నెరవేర్చెద; ఎద్దియో వాక్రుచ్చుము.

పార్వతి—ప్రాణవల్లభ! ద్యూతంబునఁ గొంతవడిఁ గ్రీడింతము. సుహృద్ద్యూతము ధర్మమే గద?

ఈశ్వరుఁడు—మంచిదటుల కానిమ్ము. (అని నందికేశ్వరునికై చూచెను.)

పార్వతి—మహాప్రసాదము. ధన్యురాలను. (అని చెలికత్తెలకై చూచెను.)

[ఇడావతి పలుకయు సారెలు నక్షములు తేవలయు.
కళావతి పార్వతీదేవి పందెమును కచ్చుటకును
నందికేశ్వరుఁడు శివునివంక పందెము కచ్చుటకును
సిద్ధముగా నుండవలయును.]

పార్వతి—ప్రాణనాథా! ఇవియే యక్షములు. మీరు ముందుగఁ బందెము వేయుఁడు.

పరమేశ్వరుఁడు—సఖీ! ఇదిగో పరమాత్ముని పందెము. (అనియక్షములనూరకదొర్లించవలెను) ఇది నాపందెము చూడుము (అని దొర్లించఁగా) భార। దుగ। తీవంచము। మూడు।

(రాఁగా నందికేశ్వరుఁడు గళ్లల్లో కాయను కచ్చుచున్నాఁడు.)

పార్వతి—స్వామీ! యిది పరమాత్మున కర్పణము (అని యక్షముల దొర్లించి)

ఇది నాపందెము చూడుఁడు (అని దొర్లించఁగా) దచ్చి। చౌవంచము। దోయము। మూఁడు। (అని కళావతి కచ్చుచున్నది.)

పరమేశ్వరుఁడు—అదిగో యీతూరి నీయాటకు లడ్డుకలిగినది. నీవ్రాడిపోదువు, గౌరి!

పార్వతి—స్వామి! తమదయ గలుగఁగ నేనా యోడుపోదును. మీ యాటకు నిదిగో చక్కపగడము. (అని దొర్లించఁగా కచ్చుటలో లడ్డుకలిగెను.)

నందికేశ్వరుఁడు—నాస్వామి! దేవివారు గెల్చినారు.

ఈశ్వరుఁడు—మాసంకల్పమే యది, నెరవేరినది.

భృంగీశ్వరుఁడు—ఎట్లాగైనా మాయమ్మగారు గెలుచునేగాని మీరు గెలుతురా! ఎప్పటికైనను; గెలుచుటకై కాముఁడు గీముఁడుగాఁడు లెండి.

ఈశ్వరుఁడు—(నవ్వుచు) భృంగీ! నీకిప్పుడు మంచిసమయమయ్యెఁ గాఁబోలు? మంచిదిలే పొమ్ము; మీయమ్మగారే గెలువనీ!

భృంగీశ్వరుఁడు—స్వామి! కృతాపరాధుని నన్ను రక్షింపవలయును. మీయంతట మీరోడకున్న మిమ్ము నోడించువారలు గలరా?

ఈశ్వరుఁడు—మంచిది; భృంగీ! నీభక్తికిని వినోదజ్ఞతకు మెచ్చితి; ఇఁకఁ గ్రమముగ ననంతరకృత్యంబున కేగుదము. పార్వతీ! చెలీ! ఇంతవఱకుం జాలఁగ వినోదించితిమి; తమి వేఁటయందుఁ బొడమెడు; కాదనక వేఁటకేగ సమ్మతింపుము. వేగంబ పోయివచ్చెద; నీవూరడియుండుము.

పార్వతి—వల్లభా! ద్యూతంబున కియ్యకొనిన నేను వేఁటకుం బోవలదనఁ దగుదునా? స్వామివారిచిత్తమే నాకు సకలసౌభాగ్యముల కాలవాలము.

ఈశ్వరుఁడు—వనితా! నీవేమియు సంకోచించి యుండకుము; సాయంతనంబునకే తిరిగి వచ్చెదను. (అన నందఱు లేచిరి. శివ నంది భృంగి చండీశులు నిష్క్రమించిరి.)

పార్వతి—కళావతీ! ప్రాణనాథుఁడు ద్యూతక్రీడఁగావించి యాఖేటనాటనాటవికి విచ్చేసిరి. మనకిక్కడ నొక్కండైనసుండక విభునితో వేఁటాడుటకుం జనిరి. మనమూరక యేమి సేయుదము?

కళావతి—మహాదేవి! తమరభ్యంజనోచితాలంకారంబవధరింపుఁడు; ఇద్దివసంబున నప్పని నిర్వర్తించి పరమేశ్వరులరాఁక వేచియుందము.

ఇడావతి—అమ్మగారూ! కళావతి చెప్పినసంగతియే నేనును విన్నవింపం దలంచితి. మా యిద్దఱితలంపొక్కటియైనది కావున నిదియే మంచిసమయము.

పార్వతి—మంచిది; ముప్పుర మేయుంటిమి. లోపలనుండుచో గవనికాపరు లేరును లేరుగద!

కళావతి—హిమగిరితనయే! తమకొక్కటి యసాధ్యంబు గలదా? మీతపః ప్రభావంబున నొక్కని సృజియించి ద్వారంబున నిల్పియుంచుఁడు. పిమ్మట నాతండును దమకుఁ బ్రియనందనుండై యింపొందును. ఇంతట నీశ్వరులును రాఁగలరు; వారితోడ విన్నవించి యాతనికెద్దియైనఁ బ్రభుత్వమిప్పింతురుగాక.

పార్వతి—సఖి! ఇదియు నొకవినోదకరంబైయుండు; బాలుని సృజియించెద. (అనఁగా ఖడ్గహస్తుఁడై బాలుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

బాలుఁడు—తల్లీ! నన్నేల సృజించినారలు? నాకేమి యాజ్ఞ? సెలవిండు.

పార్వతి—బాలకా! నీవీగవనింగాపుగ నుండుము. నేను లోపలినుండి వచ్చువఱకు నెవ్వరినిగాని లోపలికి రానీకుము. నీకు జయంబగుఁగాక. (అనిదీవించుచున్నది.)

బాలుఁడు—మహానుగ్రహము. అట్లే కావించెద. (అని ఖడ్గధరుండై నిలుచుండఁ బార్వతి యుఁ జెలికత్తెలును నిష్క్రమించుచున్నారు.)

బాలుఁడు—(ఖడ్గధరుండై ద్వారమును గాపాడుచు)

మ॥ వినుఁడో హో జనులార నేఁడు గిరిజావృత్తాంత మెల్లన్ శివుం।
దునితాంతంబగు వేడ్కతోడ నటవిందోరంపు వేఁటాడఁగాఁ।
జనినన్ బూరుషులెల్లఁదోఁజనఁగఁదా సామర్థ్య మొప్పన్ నన్ ।
జనితుంగా నొనరించి యిందు నిచియిచ్చె న్నజ్జనంబాడఁగా॥

తే॥గీ॥ స్నానగృహమునకేగి సుస్నాతయగుచు । నుండె శర్వాణి కావున మెండుగాఁగ।
రావలవదింక సెలవు రారాదు మీకుఁ । జాటి చెప్పుచు నున్నాఁడ సరగ వినుఁడీ॥

(ఇట్లని తిరుగుచున్నాఁడు.)

[పిమ్మట ఇంద్ర - యమ - వరుణ - కుబేరులు ప్రవేశించుచున్నారు.]

ఇంద్రుఁడు—క॥ బాలక! నేనింద్రుండను । కాలవరుణధనదులిదుగో కాంక్షదలిర్పన్ ।
మేలును గోరుచు వచ్చిరి । శైలజకెఱిగింపుమయ్య చయ్యనఁ గృపతోన్॥

ఇంద్రాదిబృందారకులు మందిరంబునకు వచ్చియున్నారని యద్రీంద్రనందనకుం బొందుపడునట్లు మాయందఱవాక్యములుగ విన్నవింపుము బాల!

బాలుఁడు—తే॥గీ॥ ఏమిపనియది చెప్పుమో యింద్రనాకు । నేను లోపలికేగుట నీతి కాదు ।
కార్యమును జెప్పియేగుఁడీ కరుణవుట్ట । దేవితో విన్నవించెదఁ దేటగాఁగ॥

మీరువచ్చినపని వాక్రుచ్చిన గిరిజాదేవి వారితో విన్నవించెద; మీరిందుండం జనదు: మీమీయునికిపట్టులకుం జనుఁడు. ఆమెగారు సెలవిచ్చిన రావచ్చును.

ఇంద్రుఁడు—శా॥ చండీశుండలశర్వచెంత గిరిజాసాన్నిధ్యమందీవును।
ద్దండాజ్ఞాప్రతిభావిశేషమున నుద్దామత్వముం బొందెనె।

వ్వాండ స్తత్సదృశా ర్తకోటిగను నెవ్వాఁడింకవిఘ్నా శిరా।
కుంఠంజేయసురాళికార్యములకున్గూర్మిన్విచారింపుమా॥

దాఁపనెల ? విఘ్నములచే బాధితులమై విఘ్ననాథుఁబ్రార్థింప మహాదేవుకడకు న్వచ్చి నారము. అచ్చటఁ జండీశప్రత్యాఖ్యాతులమై దేవికడ విన్నవింపరా నిందునీచేఁ బ్రత్యాఖ్యాతులమైతిమి.

బాలుఁడు—క॥ సమయంబుకానివిషమపు । సమయంబునవచ్చినీవుసాధింపుదువే।
సమయంబొనర్తుఁజెప్పఁగ । సమయంబునరమ్ముపొమ్ముశతమఘవేగన్॥

ఇంద్రాదులు—మహాప్రసాదము. (అని నిష్క్రమించుచున్నారు)
(బాలుఁడొకవంకనుండవలయు)

[పిమ్మట వేఁటలాడు వేగముతో-శివ నంది భృంగి చండీశ్వరులు ప్రవేశించుచున్నారు.]

శివుఁడు—భృంగీ! నీసంగీతవిద్యచే సారంగంబులం జేకొంటివా!
చండీ! నీచండతంజూపి సింహశరభశార్దూలంబులం జెందితివా!
నందీ! నీయానందంబున కెద్దికతము!

భృంగి—మహాప్రభూ! నాసంగీతంబున మీయట్టివారలే నాట్యమాడుచుండ సారంగంబులవి యొకలెక్కలోవా?

చండి—మహాగిరిధర్మ! శరభశార్దూలాదుల యుక్కడంచుట యంతప్రచండమా?

నంది—గిరిజానాథ! మీయనుగ్రహంబు కలిమి కలుగ నానందంబునకేమి?

శివుఁడు—భక్తులార! మీరు నాకింకరులై యుండ నేఁజేయనిది కలదా? వినుఁడు;

లయగ్రాహి.

నూటిగనుసింగములగీటడఁచియొక్కటెనువాటముగఁదెచ్చితినిబోటికొసఁగంగన్।
దేఁటగనుశరభములకూటువులఁద్రుంచికడునీటుగనువేసములఁజాటితినివేడ్కన్।
వాటముగహరిణములకూటములఁబాపియొకమాటకునుగాచితినిచేటొదవకుండన్।
గాటముగఁదిగపులధాటిగలరక్కసులమేటులగెడపితిసురకోటిచెలఁగంగన్॥

మఱియు మద్విరోధంబుగ సదనంబొనర్చువారి సవనహరిణంబుల శిరంబులఖండించితి.

భృంగి—మహాదేవ! మీవిక్రమంబునకుఁ గొఱంత యెచ్చటిది! అయినను;

ఆ॥ వె॥ కోరియితరుఁడేయుకోలంబుమీరేయఁ । గడఁగుటదియుధర్మకార్యమగునె!।
వేఁటకానితనమువిపరీతమైదోఁచు । దేవ! దేవవంద్య! దీనపోష!॥

శివుఁడు—భక్తసంరక్షణ కదియొక నెపము గావించితిఁ గాని, యేదానిం గొట్టుటకల్ల.

భృంగి—మహాసంతోషము; మీహృదయంబెఱిఁగించితిరి; ధన్యుఁడను.

చండి—గిరిజానాథ! మృగయూథవ్రజంబులెల్ల నిఖిలమృగంబుల వేఁటాడి కరిఘటాకిరిచ్ఛటా

శృంగోద్భవంబులగు ముత్తియంబులం గానుకలుగఁ దెచ్చిరి. వేఁటయుం బాటవంబుగఁ దీరె; ముదలయేని సేనాసముదయంబు న్మరలించెద.

శివుఁడు—సేనాధిపా! సర్వసామగ్రులతో సేనలం బురంబున కనుపుము. మేమును బయలు వెడలుదుము. నందీశా! పల్యాణంబు ధరియించియుండుము. భృంగియును బయలుఁ గేరనుగాక. (అనఁగా నిష్క్రమించిరి).

ఇది ప్రథమాంకము.

---

శ్రీహయగ్రీవాయనమః.

## ద్వితీయాంకము.

[తదనంతరము - ద్వారమును గాపాడుచు బాలుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

బాలుఁడు—(ఖడ్గధారియై యిటునటు తిరుగుచు)

మ॥ వినుఁడో హోజనులార! నేఁడుగిరిజావృత్తాంతమెల్లన్ శివుం
డునితాంతంబగు వేడ్కతోడనటవిన్ దోరంపువేఁటాడఁగాఁ
జనినన్ బూరుషులెల్లఁదోఁజనఁగఁదాసామర్థ్యమొప్పన్నసున్
జనితున్నానొనరించియిందునిచియిచ్చన్ మజ్జనంబాఁడఁగా॥

తే॥గీ॥ స్నానగృహమునకేగిసుస్నాతయగుచు । నుండెశర్వాణిగాపునమెందుగాఁగ
రానలవదింకనెలవురారాదుమీకు । సాటిచెప్పుచునున్నాఁడసరగవినుఁడి॥

(అనిచదువవలెను.)

[అంతటఁ జండీశుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

చండీశుఁడు—బాలుఁడా! నీవెవ్వఁడవు? ఇక్కడెందులకున్నాఁడవు?

బాలుఁడు—ఓపురుషా! నీవెవ్వఁడవు? ఇక్కడికేలవచ్చినాఁడవు?

చండీశుఁడు—(రోషముతో) ఓరియనుచున్నాఁడవు. నాపరు వెఱుఁగవురా?

బాలుఁడు—(నవ్వుతో) నామర్యాద యెఱుఁగక మాట్లాడుచున్నావు నీవెవఁడవు?

చండీశుఁడు—నీపూర్వోత్తరమేమి?

బాలుఁడు—ముందుగ నీస్వరూపం బెఱిఁగింపుము.

చండీశుఁడు—నేను శ్రీసాంబశివుని సేనాధిపతిని.

బాలుఁడు—పార్వతీమహాదేవియనీకాధిపతిని నేను.

చండీశుఁడు—ఒరే నీవు మృషలాడుచున్నాఁడవు. నిన్నిపుడు దండించెదము.

బాలుఁడు—అరే దుర్మార్గా! నామాటలనృతములనుచున్నాఁడవు నీనాలుకం గోసెద.

చండీశుఁడు—మాటలు మిగులుచున్నాఁడవు; ఇదె నీపైకి గదవేయుచున్నాను.

బాలుఁడు—నీగద నిన్నేకొట్టుచున్నది నాకేమియులేదు.

(చండీశుండు గదవేయఁగా నదితిరుగఁబడి చండీశుని గొట్టఁగా నొచ్చి)

చండీశుఁడు—(తనలో) ఏమి యాశ్చర్యమిది (ప్రకాశముగ) అరే నీవు మాయావివగు రాక్షసుఁడవుగాఁ దోఁచెడి నిన్నుక్కుమడఁగించెద. (అన నిరువురు యుద్ధము చేసిరి.) (చండీశుఁడు పరాజితుఁడై పోవలయును.)

[పిమ్మట శివుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

బాలుఁడు—ఓమహాపురుషా! నిలువుము లోనికింబోవలదు.

శివుఁడు—ఎవఁడవురా! బాలకా! నన్నే యడ్డగించుచున్నాఁడవు.

బాలుఁడు—శ్రీమహాగౌరీదేవివారు స్నానగృహంబున నున్నవారు. అట్లగుచుఁ బురుషుల నేరినింగాని లోనికి రానీఁజనదని నియమించి నన్నిచటనిల్పినారు. నేను నిన్నుఁ బోనియ్యను.

శివుఁడు—అరే నేనెవ్వఁడనుకొంటివి? మీదేవిభర్తను. నేనే సాంబమూర్తిని.

బాలుఁడు—నీవు సాంబమూర్తివైనాసరియె; ఫాలాక్షుఁడవైనాసరే; నిన్ను లోనికిం బోనియ్యను. ఆమె వచ్చువఱకు నిందుండుము.

శివుఁడు—ఓరీ! నీవు బాలుఁడవని యింతవట్టు లూరకయున్నాను. ఇఁకమీఁద నధికప్రసంగము లొనరించితివేని నిన్ను దండించెద నూరకుండుము.

బాలుఁడు—నీవు ప్రౌఢుఁడవైతే నన్నుగెలిచి లోపలికింబొమ్ము. ఊరక పోనియ్యను.

శివుఁడు—బాలకా! నీకింతపౌరుష మెచ్చటిది? ఎవనికుమారుఁడవు; నిన్ను నేనెప్పుడు నెఱిగి యుండలేదు నీ పూర్వోత్తరము చెప్పుము.

బాలుఁడు—నేనును నిన్నెప్పుడు చూచియుండలేదు; నీపౌరుషమెంతగలదో చెప్పుము.

శివుఁడు—అరే! లక్ష్యములేకుండ మాటలాడెదవేమి! నేను త్రిపురాంతకుఁడనుసుమా?

బాలుఁడు—ఏమిటి ఇది? మహాప్రగల్భాలు పోవుచున్నాఁడవు; ఊరకుండుము; అధికప్రసంగములాడితివేని బాలుని చేతిఖడ్గమూరకుండదుసుమా.

శివుఁడు—ఓహొహొహో! ముదురుచున్నదేకథ. నీవన నెంతవాఁడవురా నాయెదుట?

బాలుఁడు—మఱచిద యూరకుండుము; ప్రసంగమధికముగాఁ జేసెదవేల? నీవొపుదేని యిదె నాముష్టిఘాతమును సహింపుము. (అని కొట్టఁబోవుచున్నాఁడు.)

(శివునకును బాలునకును యుద్ధము.)

శివుఁడు—బాలునిచేతిఖడ్గంబూఁడఁ బెఱికికొని తలనరికి ఖడ్గంబుపడవైచిలోపలికేఁబోయెను.

(ఇదియంకాస్యవిష్కంభము).

[పిమ్మటఁ బార్వతియు శివుఁడును బ్రవేశించుచున్నారు.]

పార్వతి—దుఃఖించుచు,

మత్తకోకిల॥ జీవితేశ్వరపిన్నపాపనిజీవముఁగొనివచ్చితే।
భావమందునేమియనక్కనిబాలునిన్దెగటార్చితో।
నావరంబులపట్టియాతఁడునన్నుఁబాసెనెయక్కటా।
దైవమాయటులోర్వవైతివితాపమింకెటులోర్తునో॥

క॥ మీరటవికేగివేఁటను । ఘోరమృగావళులఁదున్మిక్రూరతతోడన్।
ధీరతరాఁగలుగుటచేఁ । బోరెకడువేడ్కయయ్యెఁబుత్రునితోడన్॥

క॥ కానమృగంబులక్రియమ । త్సూనునిప్రాణంబుఁగొనుటచోద్యమెమృగయా।
జ్ఞానముతొలఁగకపోయెనో । కోనాదురదృష్టవేళకోపమిదేలా?॥

నాపుత్రునేల చంపితిరి ప్రాణనాథా! నే నీదుఃఖము నెట్లోర్తును! నే నేమిసేయుదును.
(అని భూమిపైఁబడవలెను.)

శివుఁడు—(తనలో) ఏమియీవింత? వాఁడు తనకుమారుడనుచున్నది; కుమారుఁడెట్లయ్యెను? నేను వేఁటకుఁబోయివచ్చునంతలో నీకుమారుఁడెట్లుగలిగెను? (ప్రకాశముగా) ప్రియసఖి! యేలవిలపించెదవు? వాఁడు నీకొమరుండయ్యెనేని ప్రత్యాగత జీవితుండగుఁగాత.

పార్వతి—నాయట్టి దురదృష్టవతి కంతటిభాగ్యమా? పుత్రముఖంబుఁ జూడక నే నెట్లునిల్తునయ్యయో? ఈదుఃఖమెట్లుసైఁతు దైవమా?

శివుఁడు—వనితా! నీకతఁడెట్టిసుతుఁడు? ఎక్కడినుండి వచ్చినాఁడు?

పార్వతి—ఆ॥వె॥ మీరు వేఁటకేగమీపురంబునఁగల । పురుషులెల్ల వేఁటపూన్కినేఁగ।
గవనిఁగాచువారిఁగానకనాతపో । బలముకలిమివీనిఁగలుగఁజేసి॥

తే॥గీ॥ వాకిటనునిల్పిలోపలివారిగృహముఁ । జొచ్చియుండంగమీరాకద్రుక్కఁజేసె।
వానిమొకమిఁకచూడకవనటమాని । పోదువే నేమిసేయుదుభూతనాథ!॥

శివుఁడు—వనితా! అట్లైన నాబాలునికడకుం బోదమురమ్ము (అనఁగాఁ బార్వతియు శివుండును బాలునికడకు వచ్చుచున్నారు.)

బాలుఁడు—(అంతట నదివఱకే గజాననుఁడై నిలిచియున్న బాలుఁడు మాతాపితరులకు నమస్కరించుచున్నాఁడు.)

శివుఁడు—బాలకా! నీ వెట్లు బ్రతికితివి?

బాలుఁడు—తే॥గీ॥ మీయమోఘసంకల్పంబు మేరమీఱ। రాదటంచుఁజండీశుండురహిదలంచి।
యుత్తరశిరంబుగానిద్రనొందియున్న। గజముశిరమురచినన్ను జగాననిల్పె॥

కావునఁ బ్రత్యాగతజీవితుండనై భవదీయదయావిశేషంబునకుఁబాత్రంబనైతిని.

పార్వతి—(బాలుంజూచి కౌఁగలించుకొని) తనయా! ఏనుఁగుమొగముగనుండ సంకల్పించిన మీతండ్రి నిన్ను ఖండించిరి; నీగజాననత్వమే నాకు ముచ్చటదీర సంతోషకరమైనది; ఇట్లే శాశ్వతముగమనుము వత్సా.

బాలుఁడు—మహాప్రసాదము తల్లీ!

పిమ్మటఁ బార్వతీపరమేశ్వరులును గుమారుండును సభాసీనులైయుండిరి.

[ద్వారపాలకుఁడు ప్రవేశించుచున్నాఁడు]

ద్వారపాలకుఁడు—జయజయపార్వతీపతీ! శ్రీమన్మహారాజరాజపరమేశ్వర! రాజరాజసఖ! పరాక్. స్వామి! ద్వారంబున నొక్కమహాపురుషుండు నెమలి వాహనంబుగఁ జేకొని వచ్చి తనరాకం జేవరవారికి విన్నవింపం దలంపుగఁ గోరుచున్నాఁడు. పిమ్మటదేవర చిత్తంబు.

పరమేశ్వరుఁడు—ఓరీ! యాపురుషుని లోపలికనుపుము.

[పురుషుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

పురుషుఁడు—శ్లో॥ నమఃపిత్రే శంభవేస్తు నమోమాత్రేఽద్రిజాతయే।
జనకాయనమస్తేస్తు జనన్యై తేనమోనమః॥

(అనినమస్కరించుచున్నాఁడు.)

పరమేశ్వరుఁడు—మహాత్మా! నీవెవ్వఁడవు? మమ్ము జననీజనకులుగ భావించుచున్నాఁడవు.

(పార్వతిసాదరముగాఁ జూచుచున్నది.)

పురుషుఁడు—స్వామివారు సర్వజ్ఞులు. నన్నెఱుఁగకున్నవారు కారు. అయిన నిచటివారి కందఱకుఁ దెలియునటుల నన్నే చెప్పుమని యాజ్ఞయయ్యె నేని నేనే చెప్పెదను.

పరమేశ్వరుఁడు—చెప్పుము.

పురుషుఁడు—తే॥గీ॥ తారకాసురుఁజంపంగఁదాఁగోరి । వేల్పులెల్లసేనాధిపువేఁడికొనఁగ।
మీదుతేజంబునగ్నికిమితముగాఁగ । నిచ్చితిరిగదమున్ను నాయిద్ధమహుఁడు॥

తే॥గీ॥ మోయనేరకగంగకుముదముతోడఁ । జేర్పనామెయుశరవనిఁజేరఁజేసె।
నంతనుద్భవమందితినమరులలరఁ । గృత్తికలపాలుద్రావిపర్ధిలితినిట్లు॥

క॥ నాదునదృష్టముకల్మిని । మీదగుసన్నిధినిగంటిమేలగునింకన్।
ఏదియెటుండిననింపగు । నాదురితములెల్లఁబాసెనయముగనెట్లున్॥

ఈశ్వరుఁడు—పుత్రా! కడుసంతసంబయ్యె. (అని కౌఁగలించుకొనుచున్నాఁడు.)

పార్వతి—(దగ్గర చేరఁదీసికొని శిరంబుమూర్కొని,) కుమారా! ఈతండు నీయగ్రజుండు; నీవనుజుండవు; మీయిరువురు సుఖంబుగ నుండుఁడు.

కుమారుఁడు—తల్లీ! మహానుగ్రహము.

(ఇంతట తెరలో)

తే॥గీ॥ ద్వారపాలకులార ! మీదయినదయను । నింకనైనను మాకుమహేశుఁజేర।
సమయ మొసఁగంగఁజేయుఁడీసదయులగుచు । మానిరీక్షించు టెల్లను మనవిచేసి॥

ఈశ్వరుఁడు—సహచరీ! మనకిర్వురుకుమారులు గలిగి మనంబుల నానందింపఁ జేయుచ న్నారు. కావున వీరలకు నామకరణంబు లొనర్పవలయు.

పార్వతి—ప్రాణనాథ! దేవరచిత్తంబునంగలయట్లు.

ఈశ్వరుఁడు—ప్రథమపుత్రుండు హేరంబుండనవర్ధిలు; రెండవవాఁడుస్కందుండన నెగడు.

పార్వతి—స్వామి! భవత్కృతనామంబులచేఁ గుమారులిరువురుఁ బెంపొందుదురుగాక. రెండవవానికి మయూరంబు వాహనంబయ్యె. హేరంబునకుం దగిన వాహనంబుసమకూర్చి యనుగ్రహింపుఁడు.

ఈశ్వరుఁడు—వానికి నిష్టముగనున్న దానిని వాహనంబుగ నిత్తము. బాలకా! నీకు వాహనంబుగ దేనిని గోరెదవు?

బాలకుఁడు—స్వామీ! నాకు, ధాన్యభక్షణజీవనంబగు మూషకంబు వాహనంబుగ నొసఁగుఁడు.

ఈశ్వరుఁడు—మంచిదటులకానిమ్ము! నీకు జయంబగుఁ గావుత.

(తిరిగి తెరలో)

తే॥గీ॥ ద్వారపాలకులార ! మీదయినదయను । నింకనైనను మాకుమహేశుఁజేర।
సమయ మొసఁగంగఁజేయుఁడీసదయులగుచు । మానిరీక్షించు టెల్లను మనవిచేసి॥

(అని బిగ్గరగా నరుపవలయు)

ఈశ్వరుఁడు—(విని,) ఎవరచ్చట?

[భటుఁడు ప్రవేశించి]

భటుఁడు—భటుఁడు కనిపెట్టుకొనియున్నవాఁడు మహాప్రభూ.

ఈశ్వరుఁడు—ద్వారంబున నెవ్వరో మొఱలిడుచున్నారు వారిని రమ్మనిచెప్పుము.

భటుఁడు—మహాప్రసాదము. (అని నిష్క్రమించవలెను.)

[పిమ్మట నింద్ర యమ వరుణ కుబేరులు ప్రవేశించుచున్నారు.]

ఇంద్రాదులు—జయశంకర! కైలాసశైలవశంకర! భక్తజనశంకర! పరాక్.

ఇంద్రయమవరుణధనదులు నమస్కరించుచున్నారు. (అని నమస్కరింపవలెను.)

ఈశ్వరుఁడు—ఇంద్రప్రముఖులార! కూర్చుండుఁడు.

ఇంద్రాదులు—చిత్తము.

ఈశ్వరుఁడు—ఇంద్రా నీవేమిపనికై వచ్చితివి? యమవరుణధనదులార! మీరేలవచ్చితిరి?

ఇంద్రుఁడు—తే॥గీ॥స్వామి! సర్వజ్ఞులగుమీకు, సరవితోడ । విన్నవింపఁగ నేల? సంపన్నులకువి।
పన్నులనుఁబ్రోవధర్మమైపరిఢవిల్ల । ముమ్ముఁబ్రోచువారెవ్వరుమాసతీశ॥

ఈశ్వరుఁడు—అయినను మీవచ్చినపనిని దాఁచక చెప్పుము.

ఇంద్రుఁడు—ఉత్సాహ॥ మేముదలఁచు కార్యములకు మెండుగానువిఘ్నముల్ ।
గాముదంబుదక్కి మేముగాసిచెందియుంటిమీ।
గీముచేరినారమయ్య! కృపనువిఘ్ననాథునెం।
తేముదంబుతోడనొసఁగిదీనులన్భరింపుమీ॥

విఘ్నములకొక్కని విభునిఁగ దయచేసిన మున్నుఁగ విఘ్నపతింగొల్చి సర్వకార్యంబులఁ జేయఁగలము విఘ్ననాథుం గోరుచున్నాము.

ఈశ్వరుఁడు—మీకోరిక యింతియేనా మఱియేమైన నున్నదా?

ఇంద్రుఁడు—ఆ॥వె॥ తారకాసురుండుతద్దయుఁజెలరేఁగి । వేల్పుగముల నెల్ల వెతలనొందఁ।
జేయుచుండెఁగానఁజివ్వలోవానివ । ధించువానిమాకునుంచవలయు॥

తారకాసుర సంహరింపఁగల యొక్కమహాత్ముని మాకు సేనానిఁగ నీవలయును.

ఈశ్వరుఁడు—యమవరుణధనదులార! మీరేమిపనికై వచ్చినారు?

యముఁడు—తే॥గీ॥కాలదండంబుమృత్యువుఁగాలఁజమరి। తారకుండను వ్రందియుఁదామరించి।
నాదులోకంబునారకనరులనెల్ల । విడిచిపుచ్చిధరాత్ములవెతలఁగుడుపు॥

కావునఁ దారకారినొక్కనిం గృపసేయుఁడు.

వరుణుఁడు—ఆ॥వె॥స్వామితారకుండుసాగరాంబులఁగ్రోలి । నాదుపట్టణంబునలుగడలను।
దాడివెట్టిమిగులదండింపుచున్నాఁడు। వానిఁజంపువాఁడువలయుమాకు॥

స్వామి! నాదుపాశంబులెల్ల నిరాశంబులై నాకాశాపాశంబులగుచున్నవి. కావునఁ దారకుంజంపుటకొక్కని నిర్మింపవలయును.

ధనదుఁడు—మత్తకోకిల॥శంభుమిత్రుఁడటంచునించుక సంశయింపకక్రూరుఁడై।
సంభవింపఁగఁజేయునాపదశౌర్యనుత్యనిశాచరుఁ ।
శుంభుగావలియుంచెయక్షులగ్రుక్కఁజేసినిధిక్షితిఁ ।
జృంభణంబుగఁదారకుండికఁజేరకుండఁగఁజేయవే॥

క॥ ఇదియట్లుండఁగవిఘ్నము । లదనుగనుచువచ్చిమమ్మునల్లరిచేయుఁ ।
సదయతఁదారకవైరిని । విదితంబుగవిఘ్నపతిని, వేగనొసఁగుమీ॥

ఈశ్వరుఁడు—క॥ మీమనవులాలకించితి । మీమనికితములకునేగిమేలుగనుఁడికఁ ।
నేమహితులఁగనియిచ్చెద । నీమహిఁగలవారలెల్ల నెఱిఁగికొనంగఁ ॥

మంచిది; దిక్పాలులార! మీమీలోకంబులకుం బొండు.

ఇంద్రాదులు—మహానుగ్రహము. (అని నిష్క్రమించిరి.)

పార్వతి—స్వామీ ! జీవితేశ్వర ! బృందారకులు గోరిన యధికారంబు లెవ్వరికీనున్నారు.

ఈశ్వరుఁడు—భుజంగప్రయాతము॥ ధరామండలంబందుధన్యంబులౌచున్।
విరాజిల్లుతీర్థాళివేగంబుగాఁగన్।
సురాళుల్గనందోఁగుమారు న్మహాత్మున్।
వరున్ జేసెదన్విఘ్నవారంబులందున్॥

దేవీ! యొక్కదినంబున ముప్పదికోట్లతీర్థంబుల స్నానంబొనర్చి రాఁగలవాఁడువిఘ్న నాథుండు కాఁదగును. మఱియు వినుము.

భుజంగప్రయాతము॥ నగంబొక్కబాణంబునంగొట్టిత్రోవన్।
దగంజేసియాత్రోవఁదాలోకమెల్లన్।
దిగంతంబులందేగుదివ్యప్రభావుం।
డగున్ దేవసేనానియైశ్వర్యమొప్పన్॥

పార్వతి—స్వామీ ! తమయనుగ్రహముగలుఁగఁగ నెల్లరట్టివారలగుదురు ; మనతనయులన్విడిచి వేఱొక్కరికాయధికారంబుల నియ్య నేల! వీరలకట్టియోగ్యతలఁ గలుగఁజేయుఁడు.

స్కందుఁడు—జనకా ! మీరానతిచ్చిన రెండుపనులును నేనే యొనర్పఁగలుగుదును. రెండధికారంబులు నాకుం గృపసేయుఁడు.

హేరంబుఁడు—స్వామీ ! నేనా రెండుపనులం జేయఁగలవాఁడను ; నాకాయధికారంబుల నొసంగుఁడు.

ఈశ్వరుఁడు—తే॥గీ॥ తనయులారమీరిర్వురతగఁగఁదీర్థ।
యాత్రసల్పివిచ్చేయుఁడుపాత్రమొదవ।
ముందుగావచ్చువానికిమొదటిదగును ।
నవలివానికిరెండవదగునువరుస॥

స్కందుఁడు—ఇదిగో! నేను వెళ్లుచున్నాఁడను. (అని నిష్క్రమించవలెను.)

హేరంబుఁడు (లేక) గజాననుఁడు—

తే॥గీ॥ స్వామి! నాయందుఁదమకృపసాగదేని।
తీర్థములకేగివత్తునే ! తీవ్రముఁగను।
స్థూలదేహంబుమూషకజాలయాన।
మరయమందగమనమునుసమరియుండ॥

(పార్వతికై తిరిగి) తల్లీ నేను నిరుద్యోగినై యుండవలసివచ్చును! ఎట్లు రక్షించినా తమదేభారము.

పార్వతి—మనోవల్లభా! వీనికెట్లైన షణ్ముఖునికంటె ముందుగరాఁగల యోగ్యత దయసేయుఁడు.

ఈశ్వరుఁడు—మంచిది; నీయభిమతప్రకారము (చేసెదను) గజాననా! నామాటయొక్కటి వినుము (అని చెవిలో రహస్యముగ)

శ్లో॥ సకృన్నారాయణేత్యుక్త్వా(శ్రద్ధాభక్తిసమన్వితః।
గంగాదిసర్వతీర్థేషుస్నాతోభవసిపుత్రక॥

(అని యుపదేశించి) నీవు తీర్థయాత్రకుఁ బొమ్ము షణ్ముఖునికన్న నీవె ముందుగ స్నానంబులొనర్చి రాఁగలవు. వెళ్ళవలెను. [జనుమగుఁగాక.]

గజాననుఁడు—మహాప్రసాదము. [అని నిష్క్రమించి సర్వతీర్థముల మునిఁగి యచటకు వచ్చెను.]

షణ్ముఖుఁడు—స్వామి! సర్వతీర్థములనాడివచ్చితిని.

ఈశ్వరుఁడు—షణ్ముఖా! నీకంటె మున్నుగ నీయగ్రజుండు వచ్చియున్నాఁడు.

షణ్ముఖుఁడు—జనకా! తమచిత్తము.

ఈశ్వరుఁడు—చండీశా! నీవు వీరలకాధిపత్య పట్టాభిషేకములకు సంభారంబులంగూర్పుము.

చండీశుఁడు—చిత్తము. [అని నిష్క్రమించుచున్నాఁడు.]

గజానన షణ్ముఖుల పట్టాభిషేకము [సీను].

ఈశ్వరుఁడు—కుమారులారా! మీ యాధిపత్యములతో సుఖంబుగ నుండుఁడు.

[ఇట్లని సర్వజనులును నిష్క్రమించిరి.]

ఇది ద్వితీయాంకము.

---

## తృతీయాంకము.

[పిమ్మట విఘాతక విఘటకులు ప్రవేశించుచున్నారు.]

విఘాతకుఁడు—ఓరీ విఘటకా! నీవెక్కడికిఁబోవుచు నిచ్చటికి వచ్చినాఁడవు?

విఘటకుఁడు—మనవారలెవ్వారు నెందును గన్పడకపోవుటంబట్టి వారిన్వెదకుచు నిచ్చోటికి వచ్చినవాఁడను. [మఱి] నీవెచ్చటికిఁ బోవుచున్నావో? చెప్పుము.

విఘా—దేవతలెద్దియోకార్యమును జేయఁబోచున్నారఁట, యక్కార్యమునకు భంగము కలుగునట్లుచేయుటకేగుచు మనవారినేరినింగానక విచారించుచుండ నీవువచ్చితి.

విఘు—చెలికాఁడా! మనవారలందఱేమైయుండుదురు? ఎచ్చటను వారిపొడగానవడకున్న యది; మనవారి సంగతినిగుఱించి యాలోచింతము.

విఘూ—నేను గొన్నిదినములక్రిందట నొకవార్తవినియున్నాను.

విఘు—ఎట్టిదవ్వార్త?

విఘూ—మనమందఱముఁజేరి, దేవగంధర్వగరుడోరగయక్షరక్షస్సిద్ధసాధ్యులెల్లరు గావించు పనులకెల్ల నంతరాయంబుఁ గావించుచుండ, వేసారి వారందఱును మూడుకన్నులవేల్పు కడకు విన్నవింపంబోయిరి.

విఘు—తర్వాత? తర్వాత?

విఘూ—చండీశ్వరునిచేతఁ బ్రత్యాఖ్యాతులై సాంబమూర్తి నారితో విన్నవింప సమయంబు లభియింపక కొంతకాలమూరక యుండినారు.

విఘు—[తనలో] మూర్ఖులార! మీగతి యింతయే కద! [ప్రకాశముగ] ఉ. తర్వాత!

విఘూ—పార్వతీపరమేశ్వరు లిరువురు ద్యూతక్రీడసల్పిరి.

విఘు—మన్ప్రయత్నము లెవ్వియు నచ్చోసాగవుగద. ఉ. తర్వాత? తర్వాత?

విఘూ—జూదమాడియాడి త్రిలోచనుండాఖేటన కౌతుకాయత్తచిత్తులై యాటవికబలంబులు బలసిరాఁగా యటవికిం జనిరి. పార్వతీదేవియుఁ జెలులును నింటనెనిల్చిరి.

విఘు—ఊఁ. తర్వాత? తర్వాత?

విఘూ—తే,గీ॥ పార్వతీదేవి లోపలిభవనమునకుఁ। జెలఁగియభ్యంజనార్థమైచేరఁబోయి।
ద్వారరక్షణకైయొక్క బాలుమిగుల। బలిమిగలవానిసృజియించెఁ బ్రౌఢితోడ॥

విఘు—[భయముతో] దేవతలకార్యము నెరవేరును కాబోలును! తర్వాత?

విఘూ—వేయునేల? మనప్రభువగు నాత్మఘాతకుఁడును నశించునని తోఁచుచున్నది. [జరిగినకథవినుము] పిమ్మట బార్వతీదేవి లోపలనుండఁగ సాంబమూర్తి వేఁటచాలించుకొని వచ్చి వాకిటనున్న పురుషుఁడడ్డగింపఁగా వానిం దోరించి లోపలికేగెను.

విఘు—[తనలో] ఆత్మఘాతకుఁడు బ్రతికినాఁడు. ఇఁక ఫరవాలేదు. [ప్రకాశముగ] ఉ. తర్వాత?

విఘూ—తరువాతిసంగతి నాకును దెలియలేదు. కాని యొకటి యూహించినాఁడ.

[ఇంతట తెరలో బిగ్గరగా]

తే-గీ॥ జయజయపరాకుపార్వతీజయకుమార। జయజనకదత్తవిఘ్నరాజ్యయుతధీర।
జయగజాననసకలవిశ్వప్రచార। జయకుమారాగ్రజాతకంజాతనేత్ర॥
“పరాకుగజాననసార్వభౌమా!” విఘ్నచ్ఛటాధిపా పరాక్.

విఘు—ఎవ్వరో ప్రభువులు విచ్చేయు బిరుదావళులు పఠింపఁబడుచున్నవి.

విభూ—[వినుపించుకొనక]

వాకిటనున్నబాలునిం దున్మి లోపలికి విభుండు రాఁగాఁ బార్వతీమహాదేవి తనప్రాణనాథుంగని, [దుఃఖముతోఁ బుత్రహీనం జేసితిరి గదా యని] శోకింప నద్దేవుం డుదయార్ద్రహృదయుండై వానిం బ్రత్యుజ్జీవితుంజేసి మనయందఱిమీఁద నాధిపత్యంబిచ్చి నాకుఁ గాఁబోలు! ఆతనివె బిరుదాంకములు వినఁబడుచున్నవి; మనమిఁక నమ్మహాత్ముని గొల్వఁగొలువఁ బోవలయును; మనవార్తలెవ్వరైన నెఱింగిన చోఁ సఁగువాటిల్లుంగావున సరగునఁ బోదము రమ్ము అనఁగానే యిరువురు నిష్క్రమించిరి.

ఇది శుద్ధవిష్కంభము.

[పిమ్మట విఘ్నేశ్వరుఁడును మధుస్యందుఁడును రైవంతుఁడును
బరివారమును బ్రవేశించుచున్నారు.]

విఘ్నేశ్వరుఁడు చ॥ హరుఁడునుమాసతీమణియునాదరమొప్పఁగవిఘ్నరాజికిన్।
వరునిగనన్ను నేర్పఱచివారకమంత్రులఁజేసినారుమి।
మ్మిరువురనాకడన్ సరగనిప్పుడొనర్పగలట్టికృత్యముల్।
దిరమగుశాసనంబులుగఁ దెల్పెదుమీఁదగు నేర్పుమీఱఁగన్॥

మంత్రులారా మనరాజ్యపరిపాలనంబునకుం దగిన కట్టిఁడుల దిట్టముగ పట్టుగలిగి యాలోచించి విన్నవింపుఁడు.

మధుస్యందుఁడు—మహారాజ! తమరాజ్యమునంగల రాజకీయానుచరులలోః—ఆత్మఘాత-సర్వనాశ-కార్యభంగ-సమయరోగ-దివాస్వాపులు అనువారలు ముఖ్యులు; వీరలొనరించు కార్యంబులును వీరినామధేయముల కనుగుణములుగానే యుండును; ఆ యా పనులచేత సమస్తసురాసురముఖ్యుల యుద్యమముల భంగములుచేయుట వారిపనులు; వీరికొక్కరికనేకసంఖ్యలగు ననుచరులు గలరు; వీరందఱును దమస్వాధీనులై యిప్పుడున్నవారు; ముందుగ వీరువీరలీపనులు చేయవలయునని నిర్ణయింపవలసియున్నది; నాకుం దోఁచిన తెఱంగు మున్నుగ విన్నవించుకొనుచున్నాఁడను.

సీ॥ విఘ్నంబులకుమున్నవిభుఁడైనయాత్మఘాతకుఁడుసేనాధిపత్యమువహించు।
నతనికార్యంబులకనుకూలుఁడైసర్వనాశుఁడునవలిసేనలకునేత।
కార్యభంగుఁడుదేవకార్యంబులకునెల్లసమయరోగుడుమర్త్యసమయములకు।
నధిపతులైయుండనహిలోకమునదివాస్వాపుఁడువిభుఁడయియేపుమీరు।
నెల్లకార్యంబులందునుగృత్యమెఱిఁగి । వాహినీపతులిర్వురువరలుచుండ।
మంత్రులగువారుసర్వంబుమహిమనెఱిఁగి । కడపుచుందురురాజ్యంబుగరిమతోడ॥

క॥ మందప్రజ్ఞుఁడులోనగు । మందమతులకార్యములనుమాటికిమనకున్।
బృందారకకార్యవిహతి । నందెడువిత్తంబులెల్లనాయములెపుడున్॥
ఆ, వె॥ ఇట్టిద్రవ్యములయథేష్టంబుగామీర । లనుభవించిభృత్యజనులఁబ్రోచి।
కొనుచురాజ్యమెల్లననుభవింపుమువిఘ్న । వితతిసార్వభౌమవిశదముఁగను॥

మహారాజాధిరాజ! ఇది నాకుందోఁచినతెఱంగగుటచే విన్నవించినాఁడను.

రైవంతుఁడు—స్వామి! విఘ్నౌఘచక్రవర్తి! నాదువిన్నపంబుఁ జిత్తగింపుఁడు; ధూర్తాతిధూర్త, మూర్ఖాతిమూర్ఖ, అజాగరాతిజాగర, ప్రభృతులవలన నార్జింపఁబడిన ధనంబునుఁ సురాసురగరుడగంధర్వ యక్షచారణ సిద్ధసాధ్యప్రముఖుల యత్నంబుల విఫలంబులొనర్చి యార్జింపఁగల ధనంబును స్వేచ్ఛానుగుణంబుగ ననుభవించుచు మమ్మెల్ల ననురూపానుగ్రహదానంబులఁ దృప్తులం జేయుచుండవలయు. మఱియు మనుజులెల్లఁ బ్రమత్తులై యొనర్చు యజ్ఞాదులయందుఁ బ్రమాదంబున విఘ్నంబులుత్పన్నంబులైయుంట ననేకధనంబును రాఁగలయది; [సశేషము.]

[ఇంతట తెరలో బిగ్గరగా]

జయసురాసుర కిరీట కోటి మాణిక్యరంజిత పాదయుగ్మా! జయ గజాననమహారాజ! జయ! విజయీభవ! సకల సురకిన్నరగరుడగంధర్వ యక్షరాక్షసచారణ సిద్ధసాధ్య దైత్యదానవాదులెల్ల మనవికై వేచియున్నవారు; దర్శనంబొసంగవలయును.

[రైవంతుని వాక్యశేషము] వాని నెల్లసుఖంబుగ ననుభవించుచు నంతరాయసార్వభౌముఁడవై మమ్మెల్లఁ గన్నప్రజలట్ల కాపాడుచు వలయుపనుల మావలనఁ జేయించుకొనుచుండుటయే తమకృత్యంబు; ఇందులకై ప్రత్యూహజనులెల్ల వేఁచియున్నవారు.

[తిరిగి తెరలో బిగ్గరగా]

జయసురాసురకిరీటికోటిమాణిక్యరంజితపాదయుగ్మా! జయజయ గజాననమహారాజ! విజయీభవ! సకలనరసురకిన్నరగరుడగంధర్వ యక్షరాక్షసచారణ సిద్ధసాధ్యదైత్యదానవాదులెల్ల మనవికై వేచియున్నవారు; దర్శనంబొసంగవలయు.

విఘ్నేశ్వరుఁడు—మంత్రిసత్తమా! ఎవ్వారలో మొఱలిడుచున్నారు. అద్దానినానుపూర్విగ నారసిరమ్ము.

రైవంతుఁడు—ఎవ్వరచ్చట? ఎవ్వరచ్చట?

[భృత్యుఁడు ప్రవేశించి]

భృత్యుఁడు—స్వామి! ఆజ్ఞాప్రతీక్షుండై వీఁడె భృత్యుఁడున్నవాఁడు.

రైవంతుఁడు—ద్వారంబునఁ గలకలంబు గలుగుచున్నది. అదియేమి?

భృత్యుఁడు—

క॥ సురకిన్నరచారణకిం । పురుషోరగసిద్ధసాధ్యబుధవరులెల్లన్ ।
వరదుఁడగువిఘ్ననాయకు । శరణముఁ బొందఁగఁ దలంచి చనుదెంచిరొగిన్ ॥

క॥ వారలయాక్రందనముల । యారవమిదిమిన్నుముట్టెనవ్వారలపైఁ ।
గారుణ్యము నిచ్చి ప్రోచుట । కైవారింపం దలంపు కరుణావార్ధీ॥

స్వామి! సురాసురాదుల ధ్వనులై యున్నవి.

రైవంతుఁడు—మంచిది, వారిలో ముఖ్యులగువారి నల్వురం దోడ్తెమ్ము; ఇంతలో నీసంగతిని ప్రత్యూహసార్వభౌమున కెఱింగించెద.

భృత్యుఁడు—మహాప్రసాదము. (అని నిష్క్రమింపవలయును)

రైవంతుఁడు—

తే-గీ॥ దేవ! భవదీయసేవార్థదీక్షతోడ । యక్షగంధర్వగరుడవిద్యాధరులును ।
వేచియుండిరి సమ్మర్దవిరహితముగ । మున్ను నల్వురరమ్మంటిముదముగదుర॥

విఘ్నేశ్వరుఁడు—మంచిది: సరే! కూర్చుండుము. (కూర్చుండవలెను)

[పిమ్మట నింద్రయమవరుణకుబేరులు ప్రవేశించుచున్నారు.]

ఇంద్రుఁడు—నమస్కరించి. జయజయ పార్వతీనందన! గజానన! విఘ్నసమ్రాట్పదవిరాజమాన! జయజయ.

విఘ్నేశ్వరుఁడు—శచీపతీ! కూర్చుండుము.

యముఁడు—ప్రత్యూహపర్వతతటీవప్రక్రీడాధురంధర! పరాక్; మహాదేవనందన! భక్తజనహరిచందన! పరాక్; ఇదే యముని నమస్కారము.

విఘ్నేశ్వరుఁడు—దక్షిణాధిపతీ! పీఠంబుననుండుము.

వరుణుఁడు—పరాకు; పరమేశ్వరనందన! భవానీబాలక! పరాక్. మదీయంబగునమస్కారమంగీకరింపుము.

విఘ్నేశ్వరుఁడు—మంచిది; ప్రాచేతసా! అదియ భవదీయాసనంబు; గైకొమ్ము.

కుబేరుఁడు—మిత్రనందనా! సర్వకార్యనిర్వహణదక్షా! నమస్కార మంగీకరింపుము.

విఘ్నేశ్వరుఁడు—జనకప్రియసఖా! మీరలట యాసీనులరగుడు.

(అందఱుఁగూర్చుండినతర్వాత)

చ॥ సురవరులార మీరుగడు సుక్కినచందముదోఁచె, మీకును ।
స్థిరములె కా ప్రభుత్వములు? చేయఁగలట్టివిశేషకార్యముల్ ।
వరుసగఁ గల్గెనే? సురలువచ్చినకార్యములెల్లఁ దెల్పుఁడీ ।
బరవసమొప్పవానికగుభంగిని ముందుగ నిశ్చయించెదన్ ॥

తే-గీ॥ దేవవరులారమీరలెంతేముదమున । నన్ను దర్శింపవచ్చుటానందమయ్యె।
ఇంద్ర! మీవచ్చుటకుఁగతంబేమియాయె।దంతముల నెల్లఁదెల్పుమీసంతసమున॥

దేవేంద్రుఁడు—

సీసమాలిక.

శంకరతనుజాత! సామజముఖ! దేవ! విన్నవించెదనుమా వెతలనెల్ల।
సావధానతఁ గాఁగ సరగున వినుమయ్య కోరిముప్పదిమూడుకోట్లదేవ।
తలును గంధర్వవిద్యాధరయక్షచారణసిద్ధసాధ్యాశ్విగణములెల్ల।
దైత్యదానవనాగతరణివస్వింద్రమానవకిన్నరాదులునమ్ముతోడఁ।
గావింపసకలసుకార్యంబులకువిఘ్నచయములుత్పాదించిసమయములకు।
సానుకూలముగాకచయ్యనఁజెడిపోవసురలెల్లగ్రుక్కిరిసొంపుదక్కి।
దిక్కుఁగానక మేము దెసచెడి వేసరిముమ్మూర్తులకుసదామ్రొక్కుచుండ।
మాతపంబులుపండిమాకోర్కెలీడేరమూడుకన్నులవేల్పుముదమునొంది।
యంతరాయములకునధిపతిఁగానిన్నుఁగావించిమాకిచ్చెఁగరుణతోడఁ।
గానమామొఱలాలించిగారవమునఁ । గార్యభంగములొదవకకలిసిరాఁగ।
విఘ్నములుదూరమగునట్లువేఁగఁజేసి । మమ్ముశరణాగతులఁబ్రోవుమిమ్ముగాను॥

స్వామీ! మీరు వివిధవిఘ్నాధిపతులై యుండుట నేటికి సంభవించి మేమెల్లరము కృతార్థులమైతిమి; ఇక మామనవులాలకించి మాకెద్దియైన నుపాయము సెలవిండు.

విఘ్నేశ్వరుఁడు—మంచిది; మీరుపొందు కష్టముల నెల్ల వినుపింపుము.

దేవేంద్రుఁడు—స్వామీ! తమరీయధికారము నవలంబింపకముందు విఘ్నములకెల్ల నాత్మఘాతకుండు స్వామియై విఘాతకవిఘటకులు తనకుమంత్రులుగా సకలసురాసుర నరకిన్నరగరుడోరగభూతభేతాళప్రముఖులయొనరించు సకలకార్యంబులకు విఘ్నము లాపాదించుచు ధూర్తాతిధూర్త మూర్ఖాతిమూర్ఖులులోనగుసేనాధిపతులతో జగములంతట తామయ్యె విఘ్నసముదాయికులు తిరుగుచున్నారు; మఱియు ముమ్మూర్తుల కార్యంబులందుఁ దక్కతక్కిన యెల్లదేవజాతివిశేషులయు నఖిలకార్యంబులు ఖిలంబులొనర్చుచున్నారు.

తే-గీ॥ ఎట్టులైనమాకుఁగట్టురాపట్టికి । పట్టివైననీవెపట్టుగాఁగ।
నుండుమనుచునింతయోర్చియుంటిమిగాన । నీశ్వరుండవైతివిప్పటికిని॥

కావున నెద్దియైన సదుపాయంబాలోచించి విఘ్నములమా తెరవునకురానీక యాజ్ఞలో నుంచవలయును. అందుచేనెల్ల వేల్పులును, మనుజోరగులును మిమ్మునారాధించి పిమ్మట నాయా సర్వకార్యంబులంజేసికొనియెదరు. మిమ్మునారాధించువిధంబును మీకనుభోగ్య

ములైన యుపహారంబులునానతిచ్చి మీజన్మవాసరమగు నీప్రోష్టపదీశుక్లచతుర్థిని విశేషమహోత్సవపూజలనందుచు మాకార్యములనెరవేర్చుటకుఁ జిత్తంబున నాలోచించి సెలవియ్యవలయును.

విఘ్నేశ్వరుఁడు—మంచిదిమహేంద్రా! యటులనాలోచనచేసిచెప్పెదను ; ముహూర్తమాత్రము విశ్రమింపుఁడు.

ఇంద్రుఁడు—చిత్తము.

(ఇంతలో నొకపురుషుఁడు ప్రవేశించి,)

పురుషుఁడు—జయజయ విఘ్నవినాయక! జయజయ! ప్రమథగణోత్తములు తమకుఁబట్టాభిషేకమయినతరువాత, తమదర్శనము చేయఁదలఁచినవారలై ద్వారంబున వేచియున్నవారు; పిమ్మటఁ దమయనుగ్రహంబు.

ఇంద్రుఁడు—(తనలో) విఘ్నేశ్వరునియొద్దికార్యమునకును విఘ్నములాయెనే ఇఁకయెట్లు! మనమేపనికిఁబోయినను నంతరాయములేయాయెగద! (అనిసణుగవలెను).

విఘ్నేశ్వరుఁడు—ద్వారకా! "గజాననుఁడు ప్రమథగణంబులకు దర్శనంబీయ నుద్యుక్తుండయ్యును నింద్రాదిబృందారకుల కార్యభారంబుననున్నవాఁడు; కావున, వారిని మఱియొకసమయము రమ్మన్నాఁడని" చెప్పుము.

పురుషుఁడు—మహాప్రసాదము (అని నిష్క్రమించుచున్నాఁడు).

విఘ్నేశ్వరుఁడు—(మంత్రులతో) ఏమి మధుస్యందనా! ఏమి రైవంతా! వింటిరా త్రివిష్టపాధిపతులవార్తలు? మనము దేవజాతివిశేషులమయ్యును రాక్షసకృత్యములగు యజ్ఞతపోవ్రతభంగములు చేయనేల? చేయఁదలంచిన రాక్షసులొనరించుపనులకు విఘ్నంబులొనర్చిన లోకోపకారమగునుగాని దేవతాకార్యంబులకు విఘ్నంబులొనర్పనేల? మనకనుపహారంబులుగఁ బదార్థంబులందెచ్చి పూజించి వ్రతమొనర్చెనేని యట్టివారి కార్యంబులు సఫలంబులుగఁ జేతము; వారిచ్చినకానుకలు, పండులు, నుండ్రములు, నారికేళ జంబూబిల్వకపిత్థంబులు, దూర్వాంకురములు, మందారపారిజాతప్రముఖకుసుమంబులునొసంగ హానిఁగప్పంబులుగ నంగీకరించి వారివారిపనుల సానుకూలంబుగ నొనర్తము. మీతలంపేమి?

మధుస్యందుఁడు—స్వామీ! నాయేలికా! ఏలినవారు సర్వస్వతంత్రులు; సర్వజగత్ప్రాపకులు; మిమ్ము నమస్కరించువారిపనులు చక్కచేయుట మీకు స్వాభావికధర్మముగద! వేల్పులెల్ల మిమ్ముం బూజింతురుగాక; అగ్రపూజకుఁ దామే యధికారులై వారల కార్యంబులు సఫలంబునొందించుట పరమధర్మంబె. కావున నాకు నదియెసమ్మతము.

రైవంతుఁడు—ముక్కంటి గారాబుపట్టీ! యుక్కివములేక మక్కువతో మీకుఁజక్కఁగఁ

బెక్కుపూజలంగావించి నసురల గ్రుక్కింపక వారివారి కార్యంబులంజక్క పెట్టి వారి కొక్కదారిచేయుట యుక్తము. తమవిఘ్నాధిష్ఠాతలనెల్ల సన్మార్గులుగనొనర్చి తమ కానుకలలో శేషంబొసంగుడు. వారలచ్చటచ్చటఁ బడియుండుదురు. మహామహిమ గల తమకొక్కరడ్డముగ నుండఁగలరా? తమచిత్తమునంగలయట్లు కావింపుడు.

విఘ్నేశ్వరుఁడు—దేవేంద్రాదిదేవతలార! మీకార్యంబులు సఫలంబులగును. ఇఁకమీకార్య ములతెఱవునకు విఘ్నంబులురావు. త్రైలోక్యవాసులచేతను మదీయ పట్టాభిషేకదినం బగు నీశుక్లచతుర్థిని గల్పోక్తప్రకారంబుగ మదీయాకృతిగల విగ్రహంబులఁబూజించి మదర్థమై యుపహారద్రవ్యంబుల సమకూర్చి షోడశోపచారంబులతోఁబూజించిరేని య దియు మదీయాభీష్టంబు. ఇటులనొనర్ప లోకత్రయవాసులకుం దెల్పుఁడు. యమవరుణ కుబేరులార! మీరు మీమీయిక్కలకుంజక్కఁగనరిగి మీమీప్రజలకెల్ల మదీయాజ్ఞలం దెలిపి సుఖంబుగనుండుఁడు. ఇదిమొదలు ప్రతికార్యంబులందును నగ్రపూజ మాకుం జేసినచో నేయంతరాయంబును మీకుంగలుగదు.

ఇంద్రుఁడు—మహానుగ్రహము. ధన్యుఁడనైతిని.

యముఁడు—కృతార్థుఁడనైతి.

వరుణుఁడు—నాతపంబెల్లఫలించె.

కుబేరుఁడు—నేఁడుగా! మాకోర్కెలెల్ల యీడేరినవి.

(అని నల్వురు నిష్క్రమించుచున్నారు.)

విఘ్నేశ్వరుఁడు—మంత్రీ! రైవంత!

రైవంతుఁడు—స్వామి! ఏమిసెలవు?

విఘ్నేశ్వరుఁడు—సచివా! మధుస్యంద!

మధుస్యందుఁడు—చిత్తము. ఏమియాజ్ఞ!

విఘ్నేశ్వరుఁడు—మనము మొదటఁదలఁచిన యాలోచనలను దేవతలప్రార్థనలవలన విడువ వలసివచ్చినది. అయిన నయ్యదియు మదీయతాతపాదులకును గిరిజామహాదేవికిని నభీ ష్టమగు కార్యముకావుటచేత నాదరింపవలసివచ్చినది. సర్వదా సర్వత్ర సర్వకార్య ములయందును ముందు మమ్ముఁబూజించుటయనునది సకలలోకశ్రేష్ఠ్యముకలిగినదిగద! మనలంబూజింపనివారికార్యంబులయెడ మనసేనానులశౌర్యంబుఁ జూపనివ్వవచ్చును.

రైవంతుఁడు—స్వామి!

ఆ-వె॥ అట్టులయ్యెనేని యసురులహంకార । భరితులగుచుఁజేయుపనులయందుఁ।
దమకుఁబూజసలుపఁదత్కార్యములుసఫ । లంబులయ్యెనేనిలగ్గుగలదె?

మఱియు,

క॥ బృందారకులకుహితముమ । దిందలఁచెదుమీరునదియుఁదెప్పరమెయగుట౯।
ఇందులకేమిదలంచితి । రింద్రాదులకార్యభంగమిడగాకుండ౯॥

విఘ్నేశ్వరుఁడు—రక్కసులు వెక్కసంబులగు కార్యంబులకై పూజించినను పెక్కుకర్జంబులు లోకంబునకు మిక్కిలి హితములుగాక తక్కవు. క్షీరాబ్ధిమథనంబున నమృతోత్పాదనమునకై దేవతలును బూర్వదేవతలునుగూడి ముందుగ మాకే యగ్రపూజసల్పుదురు. అందు దైత్యులకార్యంబు సఫలంబుజేయకుంటిమా యమృతసంభవంబే యలవడదు. కావున నమృతోత్పాదనపర్యంతంబు వారికార్యంబులు నెరవేర్పవలయును. పిమ్మట దేవాసురులమృతంబులభియించి తత్ప్రాప్తికై యొండొరులు వివాదపడుచుండఁ బరాత్పరుండగు శ్రీమన్నారాయణుఁడు వారివాదుతీర్చి దేవతలకమృతంబిప్పించి యసురులుగ్రసమరంబునకురాఁగా నసురులంగెల్పించును. అట్టిసమయంబుల నాకంటె నధికులగువారు నిర్జరులపట్లఁ గరుణింతురు. రాక్షసులుచేయు దేవకార్యవిఘాతముల సాగనియ్యక శ్రియఃపతి కాపాడుచుండును తద్దివ్యనామస్మరణంబుజేసియేగదా నాకు నీయాధిపత్యము లభించినది.

శ్లో॥ ఉమామహేశ్వరౌయద్వత్పూజనీయౌమమాధునా।
లక్ష్మీనారాయణౌతద్వత్పూజనీయౌనసంశయః॥

ఆశ్రీమన్నారాయణుని సంకల్పమునకు వికల్పమొనర్పఁదలంపఁగూడదు ఆమహామహుని యభీష్టంబులు మనయులనికిమీఱినవి. కావున రాక్షసులకార్యంబులు సఫలతఁబొందినను దేవతలకుఁ గొదవఁబాదవవు. చూడుడు.

పంచచామరము.

హిరణ్యకశ్యపుండుమున్ను హేమకూటమందుఁదా।
నరణ్యవాసియైమము న్మహాతపంబుసల్పుచో।
వరేణ్యమంచునగ్రపూజభక్తిసల్పెఁగానఁద।
చ్ఛరణ్యదైవతంబుచేవశంబులయ్యెఁగోరికల్॥

క॥ దానంజేసిజగంబుల । కున్నాయకుఁడైమహాభఁగోరికనేలెఁ౯।
సూనున్బ్రణ్యుపథింపఁగఁ । బోనాతనిగెడపెశౌరిముదమునవినవే॥

మఱియును, వృకాసురుండు మమ్ముంబూజించి ముక్కంటివేల్పుప్రసాదంబుపడసియు, ద్రోహబుద్ధితో నావేల్పుం బరిభవింపంబూని విష్ణుమాయచే మడియఁడా! భక్తపరాధీనులగు హరిహరులసంకల్పంబులు మనశక్తిచే నిరోధింపందగినవి కావుగద! “దైత్యులవలననైన నగ్రపూజంబొంది వారికార్యముల నెరవేర్చినను నెరవేర్పవచ్చు”నని జననీజనకుల యాజ్ఞయుఁగలదు.

మధుస్యందుఁడు—నాస్వామి! అట్టిచో రక్కసులవల్లన సుమామహేశులను, లక్ష్మీనారాయణులును నపరిమితముగ బాధలంజెందుచువచ్చిరే! అయ్యది యస్మదీయ దోషంబుగాదా?

విఘ్నేశ్వరుఁడు—వారు జగదుదయరక్షాప్రళయకర్తలు. వారికవి లీలలు, లోకప్రవర్తనకై వారట్లగుటకంగీకరింతురు.

మంత్రులు—తమయిష్టానుసారము బద్ధులమయ్యెదము.

విఘ్నేశ్వరుఁడు—మంచిది; సేనాధిపతుల రప్పింపుము వారలకాజ్ఞలొసఁగుదము.

మధుస్యందుఁడు—ఎవరచ్చట? ఎవరచ్చట?

(భటుఁడు ప్రవేశించి)

భటుఁడు—అయ్యా ఇదుగో భటుఁడున్నవాఁడు. ఏమి సెలవు?

మధుస్యందుఁడు—భృత్యా! సేనాధిపతుల రావింపుము.

భటుఁడు—మహానుగ్రహము. (అని నిష్క్రమించెను).

[పిమ్మట ఆత్మఘాత విఘాత విఘటకులు ప్రవేశించుచున్నారు.]

ఆత్మఘాతుఁడు—పరాకు; గిరిజానందన! విఘ్నౌఘచక్రవర్తి! పరాక్. ఇదె సేనాధిపుని నమస్కారము.

(తక్కినవారును నట్లేచేయవలెను)

విఘ్నేశ్వరుఁడు—కూర్చుండుఁడు.

సేనాధిపులు—చిత్తము. (అని కూర్చుండవలయును)

విఘ్నేశ్వరుఁడు—(మంత్రికై చూచి) మధుస్యందా! మనయాలోచనలనన్నిఁటిఁ దెలిపి వారియునికిపట్టులంజెప్పుము.

మధుస్యందుఁడు—చిత్తము. అలాగుననే.

రైవంతుఁడు—సేనానులార! విఘ్నరాజ్యసామ్రాజ్యధురంధరులాజ్ఞాపించుచున్నారు. “నరసురాసుర గరుడగంధర్వ కిన్నరకింపురుష సిద్ధసాధ్యయక్షవిద్యాధర తుషితభాస్వరానిలాదులెల్లవారును వారివారికార్యంబులకుముందుగ మనకేయగ్రపూజఁ గావింతురు కావున, వారలకార్యంబులకువిఘ్నంబులొనర్పకుండవలెను. మాకగ్రపూజలీయనివారికార్యంబులంజెఱుపుఁడు. విశేషించిచెప్పుట లేమనఁగా, మాకగ్రపూజ యున్నను లేకున్నను భగవద్భక్తులయుద్యమంబులందు మీచరితంబు నివారింపుఁడు.”

ఆత్మఘాతుఁడు—అయ్యా! అట్లేని మాపనులెయ్యవి?

రైవంతుఁడు—

క॥ సతిపతులవిరోధంబుల । నతికోపనలై నకోడలత్తలయందున్ ।
అతిమందమతులయెడనీ । పతిముదముననుండవలయు నానతికిఁదగన్॥

ఆ-వె॥ పరులకెగ్గుచేయుపట్లవిఘాతకుం । డొరులమిత్రవరులయుక్తిమీర ।
మైత్రిఁజెరుపుచోటమనవిఘుటుండును । నుండవలయు నెప్పుడోజతోడ॥

తే-గీ॥ ప్రమథరోగదివాస్వాపసైన్యపతుల । కునికిపట్లిటమున్నె నియోజితంబు ।
లయినయవి గానమీరందరాస్థలముల । నుండుఁడాజ్ఞాప్రతీక్షులై యూర్జితముగ॥

(ఇంతలో భటుఁడు ప్రవేశించుచున్నాఁడు)

భటుఁడు—జయవిజయీభవ! విఘ్నసామ్రాజ్యధురంధర! జయా భవదీయ విఘ్నపరిబృఢత్వంబువిని సప్తమాతృకాభగవతులు తమయభివందనం బభినందింపఁగోరుచున్నారు.

విఘ్నేశ్వరుఁడు—మంత్రులారా! మాకిది కృతార్థమైనకాలము. మాతృభగవతులకభివందనంబొనర్చి నన్నుం బావనునిఁగాఁ జేసికొనియెద. మనమటకుంబోదము; సేనాధిపా! ప్రమథగణంబుల మాతృభగవతుల సన్నిధానంబునకు రాఁబనుపుము.

(అనుచు నందఱు నిష్క్రమించిరి.)

ఇది తృతీయాంకము.

---

## చతుర్థాంకము.

[పిమ్మటఁ గుటిలుఁడును నిర్మలుఁడును బ్రవేశించుచున్నారు].

కుటిలుఁడు—చెలికాఁడా! మనకువచ్చినప్రభువు, ఏనుఁగుమొగము, ఏకదంతము, తుండముఁగలిగి, పెద్దకడుపు, పాపజందెములు, మూషకవాహనమునుగలుగుటంజేసి చూపునకే హాస్యాస్పదముగ నున్నవాఁడు; ఆయనగారి ప్రభుత్వమిఁక నేరీతిగ హాస్యాధారమైయుండునో!

నిర్మలుఁడు—(నిర్వేదముతో) ఓరి కుటిలుఁడా! నీపేరునకుఁదగినట్లు మాటలాడుచున్నాఁడవురా! చూడు,

మ॥ గిరిజామానసికాత్మజుండభవసత్కృత్యైకదక్షుండునై ।
ధరలోఁగల్గుత్రికోటితీర్థములనుద్దామస్థితిన్ జాములోఁ ।
బరిశీలించియగణ్యపుణ్యగరిమన్బ్రీత్యూహరాజ్యంబుఁదా ।
భరియింపన్దగనట్టిధన్యుఁడుమహాభవ్యుండుగాకన్యుఁడే?

మఱియు,

తే-గీ॥ "పార్వతీనందనునిసదాభక్తితోడ । స్మరణచేసినఁబాపముల్సమసిపోఁగ ।
నమ్మహాత్మునినడఁతహాస్యాస్పదంబ" । యనుటనీస్వభావంబునకర్హముసుమీ॥

కుటిలుఁడు—ఎట్టివాఁడైనను భగవత్కటాక్షంబున గొప్పవాఁడగును. శ్రీభగవచ్ఛంకరోప
దేశాచరణంబునంగదా యింతకుం దగియుండెను.

నిర్మలుఁడు—అరే! ఇప్పటికిని నీకుటిలస్వభావమును విడువవైతివిగదరా? శంకరులట్లందఱికిఁజెప్పుదురా? నీవునడుగుము. నీకునట్టిపరమార్థోపదేశంబొనర్తురేమో! చూతము.

కుటిలుఁడు—

తే-గీ॥స్వామిమీమృదువాక్యముల్ సంతసముగ । హితవుసెప్పుచునున్నవియింకమీఁద।
గుటిలతమనంబునుండియుగుణమునుండి। తొలఁగియభిధానమునమాత్రదోఁచుచుండె

నిర్మలుఁడు—ఓరీ! నీవెచ్చటనుండివచ్చుచున్నాఁడవు? విశేషవార్తలేమి?

కుటిలుఁడు—

తే-గీ॥స్వామిమనవిఘ్ననాథుఁడుసప్తమాతృ । కాభగవతులసేవింపఁగాఁగడంగి।
సన్నిధికినేఁగవారలుపెన్నిధిఁగను । వారిఁబోలెనత్యానందమగ్నులైరి॥

నిర్మలుఁడు—ఊఁ. తర్వాత? తర్వాత?

కుటిలుఁడు—

తే-గీ॥విఘ్ననాథుఁడువారిదీవెనలనంది । యంతనటనుండికదలనింద్రాదిసురలు।
వాకలోకపదార్థగణంబుతోడఁ । బూజఁగావింతుమనివేఁడిరోజనపుడు॥

నిర్మలుఁడు—తరువాత? తరువాత!

కుటిలుఁడు—విఘ్నపతి యంగీకరించి సకలవిధపూజలంబడసె.

నిర్మలుఁడు—తరువాత! తరువాత!

కుటిలుఁడు—పూజకును నైవేద్యంబునకు నేమికావలయుననియడుగఁగా విఘ్నేశ్వరులు—

ఆ-వె॥ "నారికేళములును నానావిధకపిత్థ । ద్రాక్షజంబుపనసదాడిమముల।
కేతకులను చంపకకుసుమంబుల । పూజసలుపవలయుఁబూర్ణముగను॥

(వెండియు,)

ఆ-వె॥బిల్వపత్రములును పేర్మినేరేడుజి । ల్లేడుపత్రములునులీలదూర్వ।
మాచిపత్రియునునుమాదళంబులునుస । ర్వోత్తమములుపూజకొప్పియుండు॥

క॥ పనసోదుంబరకదళీ । ఘనకర్జూరామ్రమధువుకర్పూరంబుల్।
వినుడుండ్రంబులపూపము । లనుభక్ష్యములిష్టములుపదార్థములెపుడున్ ॥

అని నియమించిరి,

నిర్మలుఁడు—తర్వాత? తర్వాత?

కుటిలుఁడు—ఆ-వె॥పెద్దకడుపువేల్పు పెల్లాసఁదత్తత్ప । దార్థసంచయంబుదాత్తభంగిఁ।
బొట్టనించితృప్తిఁబొందిసురాళికి । నభయమిచ్చిపంచెనాదరమున॥

నిర్మలుఁడు—(తనలో) దైవసానుకూల్యమువలన నేటికి దేవతలు స్వకార్యనిర్వహణదక్షులైరి (ప్రకాశముగ) తర్వాత! తర్వాత!

కుటిలుఁడు—

క॥ అలరుచునలకాపురమునఁ । గలవారలుపిలిచిపూజఁగావింపఁగవి।
ట్టలరియుటనుండ్రములుకుడు । ములుమెండుగమెక్కికదలెమోదముమీఱన్॥

నిర్మలుఁడు—తరువాత! తరువాత!

కుటిలుఁడు—(దుఃఖపడుచు) కటకటా! శోకము చెప్పనియ్యదు. దుర్భాగ్యుఁడగుచంద్రుఁడు విఘ్ననాథుంగాంచి యతనియాకృతి వికృతిగనుండెనని యపహసించెను. ఆనవ్వినతోడనే రాజదృష్టియగుటచేఁ దద్దోషంబున నుదరంబుప్రయ్యలై యంత్రంబులు వీథింబొరల విఘ్ననాథుండు వినాయకుండై యటఁబడియున్నవాఁడు. అయ్యయో!! అయ్యయో!!

నిర్మలుఁడు—(దుఃఖముతో) హా! దైవమా! కుటిలా! స్పష్టముగఁ జెప్పుము.

కుటిలుఁడు—(రోదనముతో)

సీ॥ అతులితచంద్రాల్లభక్ష్యంబులనందంద వెక్కసంబుగఁజాలమెక్కిపెద్ద।
కడుపుభారంబునఁగడుమందయానుఁడై యిలుసేరవచ్చువిఘ్నేశుఁగాంచి।
వికృతాకృతియటంచువిధుఁడంతవికవికనవ్వినతత్క్షణంబరాజ।
దృష్టితాఁకుటఁజేసిదెబ్బనుదరంబువిచ్చియంత్రంబులువీడిపడుచు।
వీథిఁగొల్లాడవంతటవిఘ్నవిభుఁడు । దావినాయకుఁడగుచునుధరణిఁబడియె।
నక్కటా! రాజదృష్టికిఁనరయఁగొండ । లయిననీరయిపోవునయ్యాక్షణమున॥

నిర్మలుఁడు—(రోదనముతో) హా! చంద్రా! ఎంతచేసితివిరా!

ముక్కంటికంటిమంటకంటె గెంటుసమాయెఁగా! నీదృష్టి; కళంకీ! ఇంకెవ్వరుదిక్కు.

కుటిలుఁడు—మిత్రమా! భయంపడకుము; చండీశ్వరుండురాఁగా మనప్రభుండు ప్రత్యుజ్జీవితుండయ్యె.

నిర్మలుఁడు—(సంతోషముతో) తర్వాత! తర్వాత!

కుటిలుఁడు—విఘ్నేశ్వరుఁడులేచి చంద్రుంజూచి కనలి, శపించెను. ఏమనఁగా

ఉ॥ ఓరిదురాత్మ! చంద్ర! ననునొయ్యనవ్వినకారణంబునన్।
ఘోరుననిట్టియాపదలఁబొందితిఁగావుననింతనుండిని।
ష్కారణనిందలంబొందెదరుగాతనినుంగనుఁగొన్నవారలం।
చారశపించియేఁగెనునిజావసథంబునకగ్గజాస్యుఁడున్॥

నిర్మలుఁడు—తరువాత! తరువాత!

కుటిలుఁడు—తరువాతిసంగతులెఱుఁగుటకుం బోదమురమ్ము.

(అని యిరువురు నిష్క్రమించిరి)

ఇది చూళిక.

---

బ్రహ్మసభ.

[పిమ్మట బ్రహ్మదేవుండును సరస్వతియుఁ గొల్వుకూటంబునఁ బ్రవేశించుచున్నారు.]

బ్రహ్మదేవుఁడు--సరస్వతీ! నీపలుకుఁ దోడుకల్మిని జగంబుల సృజింపంజాలితి. సర్వవిధసృష్టియు భవదీయ సౌందర్యావలోకనమూలంబున నేయయ్యె!

సరస్వతి—ప్రాణనాథా! దేవర దివ్యశక్తిని విధేయురాలియందారోపించుచున్నారు.

బ్రహ్మ—సరస్వతీ! వింటివా!

క॥ ఇప్పుడొకవింతనొకరుఁడు। మెప్పుగనెనుసృష్టియందుమెలపుగనుదయం।
బొప్పఁగఁగనిగిరిజాతప। మొప్పనిలిచివిఘ్నరాజ్యమొందెశివుదయన్॥

సరస్వతి—ప్రాణనాయకా! నేనామహామహునిం జూడవలయు.

(ఇంతలో ద్వారపాలకుఁడు ప్రవేశించి)

ద్వారపాలకుఁడు—పరాక్ సరస్వతీ ప్రాణవల్లభా! సకలజగత్సృష్టికార్యనిర్వహణదక్షా! నమస్కార్.

బ్రహ్మ—ఏమిరా సమాచారములు?

ద్వారపాలకుఁడు--ఇంద్రాదిదేవతలెల్ల భవదీయదర్శనం బభిలషించి వాకిట నిల్చియున్నవారు.

బ్రహ్మ—వారిం బ్రవేశింపఁజేయుము.

(ఇంద్రవరుణులు ప్రవేశించుచున్నారు.)

ఇంద్రుఁడు—

శ్లో॥నమస్సరస్వతీనాథనమస్తేహంసవాహన।
నమస్సర్వజనస్యైతేనమోవాణ్యైపునర్నమః॥

అని నమస్కరించుచున్నాఁడు.

వరుణుఁడు—

శ్లో॥ నమఃపద్మోద్భవాయాస్తుపుత్రాయకమలాపతేః।
నమోవాక్యస్వరూపిణ్యైశారదాయైనమోనమః॥

అని నమస్కరించుచున్నాఁడు.

బ్రహ్మ—ఇంద్రవరుణులారా! కూర్చుండుఁడు మీసర్వాభీష్టములు సిద్ధించుఁగాక.

ఇంద్రుఁడు—అదియే మహానుగ్రహము.

బ్రహ్మ—శతమఖా! నీవేమో నేఁడు పనికలిగి వచ్చినాఁడవు.

ఇంద్రుఁడు—

మ॥ కలకాలంబునుమీరుమమ్మునరయంగానుండుటంజేసిమా।
యలదైత్యుల్గడుగాసిజేయుతఱినత్యంతార్తితోనుండిమీ।
బలముంగాంచుటచేఁగదావిజయముల్ప్రాపించుటల్మాకునేఁ।
గలచంద్రుండదియేమొకర్మ్మఁగినాఁడాలించిపాలింపవే॥

సీ॥ వేల్పులలోఁదాను వేలుపైయుండియుఁగమలారి నేఁడువికాసిగామి।
నిశలెల్లనిశంబునిష్కాంతులైయుండనర్కాగ్నితేజంబులణఁగిపోయెఁ।
బూర్ణిమఁగానమిపౌర్ణిమాన్సేష్టులమానివేసిరియజమానులెల్ల।
నోషధులెల్లనిరోజంబులయ్యెనుదేవతలెల్లనిస్తేజులైరి।
చంద్రునెడఁబాసికావునజలజగర్భ । వానిరావించిలోకప్రవర్తనంబు।
చెదరిపోకుండఁజేయుమీముదముతోడ । నమరులాహారహీనులైయలరఁగలరే॥

కావున శశాంకుండెందున్నవాఁడో దివ్యదృష్టిచే నారసి యతనిరప్పింపుము దేవా!

బ్రహ్మ—(కొంచెముసేపుధ్యానించి)

మ॥ పురుహూతావినుమెవ్వరోరిపులుమిమ్మున్గొంటురన్మాటయే।
గిరిజాసూనునిఁజూచినవ్వఁగఁగదా! గేడించిశాపించుటల్।
సురలయ్యుండియురాజసంబునగునాశోధింపసాధించిదా।
నరయంజంద్రునితప్పుగాకిదియిభాస్యద్రోహమాయెంచఁగన్॥

గజాననుండు భక్తులర్పించిన పదార్థములఁ బొట్టనిండఁగ నారగించి వీధివెంట వచ్చుచుండఁగాఁగని చంద్రుండపహసింప నాదేవునకదివెక్కసమై యుదరంబుప్రేలి యంత్రంబులెల్ల ధరణింద్రెళ్లిన నతిక్షుభితుండై చంద్రుంగనుఁగొనిన వారికపనిందలు కలుగునుగాకయని శపించెను.

ఇంద్రుఁడు—స్వామి! తర్వాత?

బ్రహ్మ—తరువాత చంద్రుండదివిని, "తాజనులకుఁ గన్పడనేల! వారికపనిందలు కలుగనేల!" అనివిచారించి మానససరోవరంబునం దాగియున్నవాఁడు వానింబిలిపింపుము.

అతనిందోడ్కొని కైలాసంబునకేగి వానిశాపంబుమరల్ప గజానన గిరిజాగిరిశులం బ్రార్థింతము.

ఇంద్రుఁడు—స్వామి! చిత్తము.

వరుణా! నీవు వేగంబచని చంద్రుం దోడ్కొనిరమ్ము.

వరుణుఁడు—అట్లే (కావించెదను) (వరుణుఁడు నిష్క్రమించుచున్నాఁడు)

బ్రహ్మ—ఇంద్రా చంద్రునితో వరుణుఁడువచ్చువరకును మనము లోపలిభవనమున నుందము రమ్ము. (అని నిష్క్రమించుచున్నారు).

(మానససరోవరపుసీను.)

[పిమ్మట మానససరోవరముచెంత వరుణుండును లోపలచంద్రుండును ప్రవేశించుచున్నారు]

వరుణుఁడు—అమృతకిరణా! పొడచూపుము; నేను వరుణుండ; సరస్వతీవల్లభు ననుజ్ఞవడసి నిన్నుం దోడ్కొనిపోవ వచ్చినాఁడ; మహాపురుషుల ననువర్తించుట నీయట్టి ద్విజరాజునకుం దగుఁగద! వేగంబ నీరుబయలుదేరిరమ్ము. వచ్చి నాతో ముచ్చటింపుము.

చంద్రుఁడు—వరుణా! నీవేల యరుదెంచితివి? ప్రాణబంధుండవగుటచే నీమాటలనుల్లంఘింపనుదగదు. (వినుము)

ఉ॥ ఎవ్వనిచేత నేమిపనికెంతబలంబొరయెఁ యుంగలేకదా।
మివ్వసుధన్విభుణ్ వృషభమీ నెననందగమాడఁగట్టుఁడీ।
చివ్వననంచుఁబల్కుమతిశీలతనున్న నిఁకేమిసేయుదుణ్।
దవ్వగదాచిదాత్ములకతథ్యశరీరవిమోహ మెల్లెడణ్॥

ఉ॥ లోకమునందునాయునికిలోచనగోచరమయ్యె నేనిత।
ల్లోకులునిందపాల్పడుచులోపముననృసియింతురంచుదా।
నేకరదుండుపల్కెనిఁక నేలమదీయభవంబు,లోకులణ్।
వీకనునిందపాల్పఱుచువృత్తికినొల్లఁదపంబొనర్చెదణ్॥

కావున నేనింక నెవ్వరికిం బొడసూపక తపంబునఁ బ్రొద్దులుపుచ్చుచు సుగతింబొందెద; నేనీతోడ రాఁజాలను; నీవూరకచనుము.

వరణుఁడు—శశాంకా! జరిగినదానికేమిచేయఁగలము. మహాత్ములవలన శాపానుగ్రహంబులు పర్యాయంబునఁ గలుగుచుండును.

(మాడుము.)

క॥ దక్షుఁడునిన్నుశపించియు। దక్షతశాపంబుఁదా నెతప్పింపఁడె! మఱి।
బుక్షపవాణీవల్లభు। వీక్షింపుముశాపమెల్ల నేగ మెయఁగుణ్॥

కావున వేగంబ లేచిరమ్ము; నీశాపంబెల్ల గ్రమ్మరింప శతానందుండే చాలును.

చంద్రుఁడు—(దీనస్వరముతో) నేను సుధాకలశంబులతోఁడఁబుట్టియు, సుధాకిరణుఁడ నయ్యును. సురవిభులకెల్ల నన్నమనయ్యును, సర్వౌషధీనాథుఁడనయ్యును, పర్వపర్వంబునఁ బాము నోటఁబడుటయు, నాపత్నులయెడ నాయభీష్టంబుపగిది నుండనీయక దక్షుండు శపించుటచే దేహంబు క్షీణించుటయు, నేఁడీశాపంబునుగలిగె; ఇట్లు లెక్కలేని బాధలుపడుచున్నవాఁడ. నాకేనాటికిని సంతోషంబులేదయ్యె. నేనమరుండ నగుటకుం జింతిలుచున్నవాఁడ. నేను చేసినప్రయోజకతకు నల్వుర మొగమెట్లు కాంతు. నే నటురానున్న నేమి నాబ్రతుకు దినదినగండంబుగ నున్నయది.

వరుణుఁడు—ఓ వెఱ్ఱిచందమామా! నీవేమో «బాధలపడుచున్నానని» యనియెదవు. మాబోంట్లు పడుబాధలకు లెక్కయున్నదా! మాభయావస్థలవిన్ము—

సీ॥ ఏ కాలమందు నేరాకాసివచ్చిమా రాజ్యంబులొందు నోయంరహిదలిర్ప।
నేతారకాసురుఁడే వేళఁదానవచ్చిమాటమోయించునో మొరటుఁజేసి।
యేదైత్యునకుఁదపంబీ డేరివరములఁగొనివచ్చునోమమ్ము గోడుగుడుప।
నేనిశాచరునకు నేయూడిగముసేయఁబాలౌదు మోయనిభయమునొంది।
మేముపడుపాట్లఁజెప్పఁగమితములేదు । హరిహరులనాశ్రయించినుగారులకుమ।
జేటుకల్గించుచుందుముసిద్ధముగను । నయినదైత్యులువత్తురన్భయము మెండు॥

వెండియు.

క॥ కుశలమునమండ నెవ్వఁడో । పిశితాశనుఁడేఁగుదెంచిపీచమడఁచుచుక్ ।
విశదంబుగమాయందఱు । మశకంబులభంగిఁజూచుమదబలయుతుఁడై॥

కావున మాయవస్థలనెన్నినచో నీయుందువిధంబు మహాసామ్రాజ్యంబు. ఇవియన్నియుం దలంచి లోకకర్తయగు చతుర్ముఖునను గ్రహంబున శాపవిమోచనంబంది దేవతల కొకింత యున్నంబుగలుగ సోమలతాదులగు నోషధులఁ బెంపుజెందింపుము. నామిత్రత్వం బంగీకరించి కాదనక నావెంట నేరమ్ము.

చంద్రుఁడు—ఆ-వె॥నీవుహితుఁడవౌటనీతోడవత్తును । దగదుజనులకేను మొగముఁజూప।
పట్టినిందలెల్లవారలకగుఁగాన । బట్టయడ్డమిడుదుబయులికిపుడు॥

(అని మొగమునకు బట్ట యడ్డము పెట్టుకొని బయలుదేరివచ్చును)

వరుణుఁడు—చంద్రా! ఇటుఇటు(రమ్ము) విరించిమందిరంబునకుం ద్రోవ ఇదెఇదె.

(అని యిరువురు నిష్క్రమించిరి.)

[బ్రహ్మయు సరస్వతియు నింద్రుండును నెప్పటియట్ల కూర్చుండఁగ వరుణుఁడు చంద్రునితోఁ బ్రవేశించుచున్నాఁడు.]

వరుణుఁడు—స్వామి! చతురానన! వీఁడె చంద్రుండు వచ్చియున్నవాఁడు; సలజ్జుండై పవస్త్రపిహితాననుండై యిట నున్నవాఁడు.

బ్రహ్మ—మంచిది; వరుణా! కూర్చుండుము.

వరుణుఁడు—చిత్తము. (అని కూర్చొనవలెను.)

బ్రహ్మ—చంద్రా! నేనుండఁగ నీకు సాధ్వసంబేల రమ్ము.

చంద్రుఁడు—(వచ్చి) శ్లో॥ నమోహిరణ్యగర్భాయనమోస్తుపరమేష్టినే।
నమోస్తువాణి! తేనిత్యంశారదాయైనమోనమః॥

స్వామి! చతురానన! వాణి! లోకపాలురాణి!

ఆత్రేయుండగు చంద్రుఁడు వందనంబిడుచున్నవాఁడు. (అని నమస్కరింపవలెను.)

బ్రహ్మ—వత్సా! ఇటు రమ్ము. కూర్చుండుము. (చంద్రుఁడు కూర్చుండవలయు.)

బాలకా! చంద్రా! నీకు శాపంబుగలిగిన నలిగి లోకవర్తనంబుడుపనేల! అట్టివిమాతో డఁ జెప్పినచో మేముచక్కఁపఱుపమా! ఇఁదు నీకు వేఁగువారు గలరా! ఏలరావైతి! నీయభిమతంబేమి!

చంద్రుఁడు—నాజన్మకాలంబెట్టిదో కాని యెల్లప్పుడు నిక్కట్టులంబొందుటయే యగుచున్నది. పర్వపర్వంబునం బామునోటఁ బడుటయు, బహుపక్షంబునకు క్షీణకాంతినగుట యునుండఁగా నన్నుఁజూచినవారి కపనిందయుఁ గలుగనాయెను. నేనీలోకంబున నుండి యెల్లరనిందాపాత్రులఁజేయు పాతకమున కొడికట్టఁజాల నన్ను వేఁటుగ నెందే నుండ సెలవొసంగుఁడు.

బ్రహ్మ—వత్సా! నీవు వెఱవకుము; నీమీఁదిశాపంబు మరల్ప నేన సమర్థుండ; అయినను శాపకర్తలగు గణేశగిరిజాగిరిశులం జూడంబోదము రమ్ము. వారియెదుటనే నీశాపంబుడిగింపించెదను

చంద్రుఁడు—ఏలినవారిచిత్తంబునఁగల యట్లొనర్పందగుదురు. అయినను నాదుమనవి యొకటిగలదు.

బ్రహ్మ—ఎట్టిది! వెఱవకనుడువుము.

చంద్రుఁడు—స్వామి! వినుఁడు:

ఉ॥ శ్రీమదుమామహేశ్వరులచిన్నికుమారునినాగణేశునిన్।
మామకదృష్టిచేఁగనినమాత్రపిచండముఁవ్రీలియుంద్రముల్।
భూమినివ్రాల్గఁగానతఁడుమూర్ఛమునుంగఁగజూచిచండియు
న్దీమహితుండువచ్చియతితీవ్రముగాశ్రమమాన్పనంతటన్॥

ఉ॥ ఆతఁడెనగ్గజాననుఁడహంకృతితోననుఁజూచిచంద్రదనీ।
వీతఁడెనన్నుఁగాంచియుహసించితిగావుననిన్నుఁజూచువా।
రేతఱిఁ గిత్తనిందలకు నెట్టినుహామహులై నఁబాత్రులౌ।
గాతయటంచుశాపమిడి గ్రక్కునఁజేరెస్వకీయసద్మముల్॥

ఉ॥ అంతట నాదుమూర్తి యిసుమంతయులోకములోనివారికిన్।
జెంతలఁజేరనీకకడుచింతనతోడఁదపంబొనర్పఁగా।
కింతటనందుమానసమునింకిటవాసముగాఁగనెంచియు।
త్యంతతపంబొనర్పఁగ ప్రయత్న మొనర్చితిభారతీపతీ॥

ఉ॥ శంకరుమూర్ధమందుఁగలశాశ్వతమత్కళనాహరించితిన్।
శంకయొకింతలేక, గిరిజాపతికిన్గడునాగ్రహంబురా।
దింకఁదలంపమిందలఁచియేమిగఁజేయునొ తెల్పరాదుమా।
రాంకవిభేదినన్ను నికహర్షముతోడుతనిల్వనిచ్చునే॥

ఇన్ని యపరాధములనొనర్చి భవానీశంకరుల నెట్లు నిర్లజ్జుఁడనై సేవింతు! ఏ మొగం బున వారలనభ్యర్థింతు నిది యొల్లమదీయంబగు విజ్ఞాపనంబు. ఇట్లనేకాపరాధంబులొనర్చినకతంబున నాకడకురాఁ దలవంపులగుచున్నవి.

బ్రహ్మ—సోమా! నీకవియన్నియు నేల? నాతోడంజను దెంచినచో నిన్నా దేవుండాగ్రహింపఁడు. మఱి యనుగ్రహించును వెఱువకుము.

[ఇంతలో భటుఁడు ప్రవేశించి.]

భటుఁడు—తే-గీ॥ జయసకలలోకసర్జనచతురదేవ। పార్వతీపరమేశ్వరుల్ప్రాభవమున।
లోకసంచరణంబునుజోకమీరఁ। జేయుచునువీరెతమపురిఁజేరిరిపుడ॥

బ్రహ్మ—భృత్యా! మంచిది! నీవుపోయి పీఠంబులం దెచ్చియుంచుము.

భటుఁడు—మహాప్రసాదము (అని నిష్క్రమించుచున్నాఁడు.)

బ్రహ్మ—చంద్రేంద్రవరుణులారా! మనయభీష్టంబిందే సమకూడనైయున్నది. కైలాసయాత్రకుం బనిలేదు. వారిరాక కెదురుచూచుచుందము.

చంద్రాదులు—మహానుగ్రహము.

[పార్వతీపరమేశ్వరులు విమానముతోఁ బ్రవేశించుచున్నారు.]

(బ్రహ్మేంద్రవరుణచంద్రులును సరస్వతీదేవియు నిలిచి నమస్కరించుచున్నారు.)

బ్రహ్మ—(శివునితోఁజూచి) సృష్టిస్థితిలయకారణభూత! త్రిలోచన! నాయందలి యనుగ్రహంబున నాలోకంబెల్లఁ బవిత్రంబుగాఁగ మాతపంబులన్నియు ఫలింప భవదీయదర్శనంబు

లభించి సుఖులమైతిమి. తమకై యీసింహాసనం బుంచఁబడినది; దానియందుఁ గూర్చుండి మాకు లోచనాసేచనకం బొనర్పుఁడు.

సరస్వతి—(పార్వతింగూర్చి) జగన్మాత! హిమాలయనందని! నన్నుం బవిత్రం జేయ మీరలే తెంచినకతంబునఁ బుణ్యురాలనయితి. ఈ పీఠంబున నధివసించి నన్నుం గరుణింపుము.

(అందఱు గూర్చుండవలెను)

శంకరుఁడు—చతుర్ముఖా! సృష్టివిశేషంబులేమి?

క॥ ఈచంద్రుండీయింద్రుఁడు । నాచక్కని వరుణుఁడవలనమరులుఁ వరుసన్ ।
ఏచందమెఱుక సేయఁగ । వేచను దెంచిరో యెఱుంగ వివరింపుతగన్ ॥

బ్రహ్మ—క॥ సర్వజ్ఞత మీకుండఁగ । నుర్విని మీకెఱుఁగఁ జెప్పనోజయ్యుఁగలదే! ।
శర్వాణీప్రియవల్లభ । గీర్వాణులరాక నెఱిఁగి కృపఁ బ్రోవవలెన్ ॥

శంకరుఁడు—చతురాననా! అట్లైన నే నేయడిగెద వినుము.

క॥ మాగణపతికిన్ భక్తులు । రాగంబున నొసఁగినట్టి రమ్యఫలంబుల ।
వేగంబ మెసవి వీధుల । రాఁగాఁ గని నగియె విధుఁడు రాజసవృత్తిన్ ॥

క॥ దానికిఁ గనలి శపించిన । దానిఁ కలోకమున నుండఁదగదనుచు మదిన్ ।
బూని శశాంకుఁడు దాఁగిన । దానఁ దృణాద్యోషధులును దామణఁగె మహిన్ ॥

దానం జేసి లోకంబుల హవ్యకవ్యంబులుఁ జరుగక జగంబులందంతట శ్రౌతస్మార్తకర్మలోపంబగుటచే దేవతలకాహారంబులేక కృశించి దీనికిఁ బ్రతివిధానం బాచరింపఁగోరి నిన్నుం జేరిరిగద!

బ్రహ్మ—చిత్తము. కర్తవ్యశేషంబు తమయధీనమైయున్నది.

శంకరుఁడు—అందులకేమి యాలోచనచేసియున్నారు!

బ్రహ్మ—తమకు మారుని శాపంబు మరలింపను, సోముననుగ్రహింపను దమరే సమర్థులగుట వలనఁ దమసన్నిధానంబునకు రాఁ బ్రయత్నించుచుండఁ దామే మామీఁది దయతోఁ బంగూపరి గంగాప్రవాహన్యాయంబున నిటకు విచ్చేసితిరి. కావున చంద్రునకుం గల యిక్కట్టులం బాపుటకు వేఁడుకొనుచున్నాఁడను.

చంద్రుఁడు—లేచి (శివునకై తిరిగి)

క॥ లోకశివంకర శంకర । ప్రాకటసద్భక్తపోషపరమను వేషా ।
నీకరుణయె మా వేల్పుల । కాకరమగుఁ గాక వేఱెయున్యముగలదే! ॥

అత్రేయుండగు శశాంకుండు వందన మొనర్చుచున్నాఁడు. (అని నమస్కరింపవలెను.

చంద్రుఁడు—(పార్వతీదేవికై తిరిగి)

తే-గీ॥ తల్లి మీముద్దుతనయుఁడు దారి రాఁగఁ । గాంచి యపరాధినైతిని గావుమమ్మ ।
శిశువులొనరించుతప్పులశిక్షగలదె? । కానదయఁజూడుమన్న వ్యగ్రంబునాక॥

తల్లీ ఆత్రేయుండను చంద్రుండను వందనంబిడుచున్నాఁడు. (అని నమస్కరింపవలెను.)

శంకరుఁడు—చంద్రా! నీయపరాధంబుల క్షమించినాఁడను. నీశాపఫలం బెల్లప్పుడును లేకుండుఁగాక! విఘ్ననాధుని జన్మదినంబునమాత్రము ఫలించును గావుత. నీవెప్పటియట్ల యామినుల నలంకరింపుము. తత్కాలశాపఫలంబును నొకమహాపురుషుం డొసర్పఁగల యపనిందాపరిహారచరితము వినుటవలన విముక్తియగును. నీకేమియుఁ గొఱంతయుండదు. నీమూర్తి నెల్లయెడలఁ బ్రవర్తింపఁజేయుము. లోకములకార్తి కలుగఁజేయకుము. నీ వెట్టిజూర్తియుఁ బొందకుము.

చంద్రుఁడు—మహాప్రసాదము. దేవరవారి యాజ్ఞాప్రకారము చేసెదను.

శంకరుఁడు—చతురాననా! చంద్రుం గటాక్షించితిమి; వానినిర్విభావరీసమయంబుల నలంకరింపఁబంపుము.

బ్రహ్మ—ఇంద్రవరుణులారా! వింటిరా! శంకరులమాటలు. ఇఁకఁజంద్రుం బురస్కరించుకొని పొండు.

చంద్రా! నీవింక శంకరునానతిని, గొంకక శనివిబుధుల కుల్లాసంబొనర్పుము.

చంద్రుఁడు—అనుగ్రహము. తమచిత్తప్రకారము.

శంకరుఁడు—బ్రహ్మాండసృష్టికర్తా! వెళ్లివచ్చెదను.

పార్వతి—వాగ్దేవి! ప్రియసఖి! వెళ్లివచ్చెదను.

సరస్వతి—మహానుగ్రహము; మహాగిరినందని!

ఇట్లందఱును నిష్క్రమించిరి.

ఇట్లు నాల్గవయంకము.

---

## పంచమాంకము.

స్వర్గలోకమున నింద్రసభలో.

[ఇంద్రుండును బృహస్పతియుఁ బ్రవేశించుచున్నారు.]

ఇంద్రుఁడు—వాచస్పతీ! నేటికెల్లయాటంకములును దీరినవి.

తే-గీ॥ తారకాసురు గెల్వఁగాఁ దానుబూనె । జనకునాజ్ఞనుదగఁగవిశాఖుఁడలమి।
రాజ్యభారంబువహియించె రమణతోడఁ। గార్యములవిఘ్నములనాపగజముఖుండు॥

ఆ- వె॥ విఘ్న నాథుశాపవికటవాక్యంబుల । విముఖుఁడైనచంద్రుఁ డెలుఁగుమాన్పి।
సోమముఖ్యలతలసొంపుదక్కఁకయుండ । యామినులనునిల్పితఖనికరుణ॥

సర్వవిధముల గీర్వాణులకుఁ గార్యసాఫల్యంబొనర్చితినని యిప్పటికిం దోఁచెడును.

బృహస్పతి—పురుహూతా! నీచెప్పిన యట్లన్నిపనులు సమకూడినవిగాని యింకొక్కటి రాఁబోవుచున్నది. నీవును యమవరుణకుబేరులును నాయాపనులకై బ్రహ్మరుద్రుల సమీపంబులకుం దిరుగుటంజేసి రక్కసులెల్ల యుక్కుమిగిలి వర్తింప భూలోకంబున రాజవంశంబులం దుద్భవిల్లి బహుమాయలంజేయుచు సాధుజనులఁ బీడించుచుఁ దపఁబులం జెఱుపుచు జన్నంబులబన్నంబు నొందించుచు లెక్కకు మిక్కిలిగ నెన్నటికిని మృత్యువు నొందక భూమికి భారంబుగానున్నవారు. ఎప్పుడో యకార్యంబును నెరవేర్పవలసియున్నది.

ఇంద్రుఁడు—ఆచార్యా! ఇంద్రునకెన్నటికి సుఖంబుగల్గును. ఎప్పటికిని రక్కసులబాధలే ప్రబలుచుండెను. నిన్నటివఱకును వాణీగౌరీవల్లభుల ననుసరించి యనుసరించి యీపనులన్నియు నెరవేర్చితిని. భూమివచ్చినచోఁ దద్భారావతరణార్థంబర్థింప మరల వారలసన్నిధానంబున కెట్లేగనేర్తు. ఇంద్రునిపని యంతకష్టముగల దెద్దియును గాదుగద! మూఁడులోకంబులఁ జీకాకుపడనీక కాపాడవలయును. ప్రతిసమయమునను దితిజన్ములే మసలవేపుకొని తినుచున్నారు.

బృహస్పతి—మహేంద్రా! నీప్రభుత్వంబువలనఁ ద్రైలోక్యమును వర్తిల్లుచున్నయది. నీదు వజ్రంబె సర్వజనులకు విరోధి నిరసనంబొనర్చుచున్నయది. ఒకానొకసమయమునఁ బ్రబలశత్రువులచే నీకలజడి గల్గినచో మువ్వురుత్తులు నిన్నుం గాపాడుచున్నారుగద! ఈపర్యాయము శ్రీమహాలక్ష్మీప్రియుండైన శ్రీమన్నారాయణుని యొద్దకుఁబోయి భూదేవిపని నెరవేర్పుము. ఇదియునుంగాక విశేషించి రాక్షససంహారంబునకా దైత్యారిగాక యింకొకరు సమర్థులుగలరా?

ఇంద్రుఁడు—

సీ॥ ఆచార్య! మీరలాహరినిజెప్పినయట్లు,యతఁడెలోకస్థితికర్త్రాభంగి।
దైత్యులనెల్లరఁదగనిహతులఁజేసియాదితేయులనెల్లనరసిప్రోచు।
నతఁడెయాశ్రితవత్సలాత్ముఁడు హేయగుణరహితుఁడాపన్నరహితుండు।
కల్యాణగుణుఁడువిజ్ఞానస్వరూపుఁడుబ్రహ్మాదిలోకసత్త్వాలకుండు।
చతురుఁడాతఁడులోకముల్ సరవిఁబ్రోవఁ । గంటికినిరెప్పకైవడిఁగరుణతోడఁ।
గాచుఁగావుతమీవచోగరిమచేత । బడలికలుదీర్చుభూదేవివచ్చుబదనుక॥

బృహస్పతి—ఇంద్రాదులారా! నేనింక బడలికలుదీర విశ్రమింపుము. నేనును గృహంబునకరిగి యా యా వేళలకుఁ బ్రత్యాసన్నుఁడ నయ్యెద.

అని యిరువురు నిష్క్రమించుచున్నారు.

(శుద్ధవిష్కంభము.)

---

[పిమ్మట భూదేవియు వేత్రవతియు క్షేత్రపురుషుఁడును బ్రవేశించుచున్నారు.]

భూదేవి—సఖి! వేత్రవతి! ఇక్కాలంబున రక్కసులెల్ల లెక్కకుమిక్కిలిగ వెక్కసంబుగఁ గ్రిక్కిరిసి యున్నవారు. వారివారికి పెక్కుగసంతానమును జక్కఁగ సాగుచున్నది. ఎందకైనఁ బెరుఁగుటయేకాని యొక్కండైన నస్నెడబాయుటలేదు: ఇంద్ర యమ వరుణాదుల లోకంబుల లోకంబులై శూన్యంబులుకాఁగా నామీఁద నతిభారంబుప్పతిల్లుచున్నయది. ఇప్పుడీయసురులరూపు మాపువారెవ్వరు? ఏది దిక్కు! అబ్బా!! యీభారమున కోర్వఁజాలను.

వేత్రవతి—తల్లీ! కాలుండు గలండు. కాలక్షేపితులై యసురులునురులు వీడెదరు; వెఱవకుమమ్మ!!

క్షేత్రపురుషుఁడు—జగద్ధాత్రి! ధాత్రి! తల్లీ! నీవేమియుఁ గసుగందకుము. శేషకూర్మవరాహ దిగ్దంతావళికులగిరులపై నీభారంబునిచి దేవేంద్రునికడకుంబోయి యాతనితో మన యిక్కట్టులం దెలుపుదము. ఆతండేగద త్రైలోక్యపాలకుఁడు! ఆతండెద్దియైన గతి కల్పింపఁగలండు. లేకున్న నీదు ప్రాణనాథుండగు పద్మనాభుండుండ మనకేమిభయంబు!

భూదేవి—వత్సా! మనోవల్లభులకిట్టి స్వల్పకార్యంబులం జెప్ప నేల! ఇంద్రాదులచే నయ్యెడు కార్యంబునకు వారింగోర నేల! ఇంద్రునివద్దకే పోవుదము.

వేత్రవతి—అమ్మా! ఇట్టిమహత్కార్యంబొనర్ప నింద్రుఁ డెంతటివాఁడు! అతనికే యంతసామర్థ్యంబుండినచో యెన్నిసారు లసురులచే బన్నంబుఁ బొందినవాఁడు కాఁడు! యమ వరుణప్రభృతులును దమతమయధికారంబులు తొలఁగి పెక్కుమాఱు లలజడిపొందిన వారుకారా! నీయందలి రాక్షసులవణంప నింద్రుండు చాల కునికి నిక్కువంబు. కావున భవన్మనోహరుల కడకుం బోవుటయే శ్రేయస్కరంబని తలంచెద.

భూదేవి—అట్లయిన నింద్రాదులతోడం బోవుదము.

[అని యందఱు నిష్క్రమించి సభాసీనుఁడయిన యింద్రునికడకు వచ్చుచున్నారు.]

ఇంద్రుఁడు—(ససంభ్రమముగలేచి)మహీమహాదేవి! శతక్రతుండు వందనంబిడుచున్నాఁడు.

బృహస్పతి—(లేచి) వసుంధరామహాదేవి! వాచస్పతి మ్రొక్కుచున్నాఁడు.

భూదేవి—అన్నలార! మీరలుభయులును కుశలులు గదా.

ఇంద్రుఁడు—తల్లీ! పీఠంబు నలంకరింపుఁడు.

భూదేవి—నా మొదటిపీఠంబు దిట్టపఱిచినం జాలును. పీఠాంతరంబు లేల!

ఇంద్రుఁడు—ఏమితల్లీ! యట్లానతిచ్చుచున్నారు?

భూదేవి—క॥ నీవింద్రుఁడవై యుండియు । నావికృతుల నాలకింపవా యిక్కట్టుల్ ।
పోవఁదగఁ జేయువిధముల । నేవనుసనుదలఁపవైతి వేమనుదింద్రా॥

ఇంద్రుఁడు—ఏమి బాధలు? సెలవిండు తల్లీ! మీయాజ్ఞాప్రతీక్షుండనై యున్నవాఁడ.

భూదేవి—సీ॥ భువిజరాసంధుఁడన్ భూపతి, క్రూరుఁడక్షౌహిణీశతముల సైన్యములను।
సాళ్వపౌండ్రకచైద్యజనపతులును శిశుపాలకంసాదులు బహుబలాఢ్యు।
లుగ్రతరసైన్యసదోపాసకులనన్నుఁ బదఘట్టనంబుల బాధపఱిచి।
మరణవర్జితులయి మహితతపంబుల దోర్వీర్యవంతులై దుష్టబుద్ధి। [లగుచు।
దర్పమునఁ గాలకాలదండముల గెలిచి । మృత్యునకుఁ దామె సెక్కటిమృత్యు
నాకు భారంబుగాఁగ ననలుగడలును । నుక్కుమిగిలిరి వారలయుక్కణంపు॥

ఇంద్రుఁడు—తల్లీ! అరక్కసులుక్కుమిగిలి పెక్కుతపంబుల రాయంచజక్కిజోదు స్తైప్పిం
చి బాహుబలంబుల నిఖిలసురాజేయులై లెక్కకుమిక్కిలియగు బలంబుల నిఖిలలో
కంబుల బాధించుచున్నవారు. వారలయుక్కడంప ముక్కంటికైన నరుదన నితరులెం
తవారు! కరటిరక్కసులఁ రిబమార్పఁ గరటీంద్రపాలకుండు గాక వేఱొక్కరికిఁ దరం
బుకాదు. కావున, తల్లీ! మనమందఱము మాధవుకడకుం బోదము.

భూదేవి—క॥ నాకెట్లురాఁగఁదీఱను । నాకాధిపనాదుకార్యనయమునఁ దీర్పన్।
శ్రీకేశవుకడకరుగుము । నాకై ప్రార్థింపుమతని నతితతియుతిచేన్॥

క॥ ఈరాత్రసభారంబున । వారాహధ్రుమీపశేషవరులెల్లరో।
రారాదునాకునిటపైఁ । బోరామియెఱింగినన్నుఁ బోనిమ్మటకున్॥

క॥ నీవును వాచస్పతియును । దేవతలందఱును గూడి స్థిరతరభక్తిన్।
శ్రీవిష్ణుని బ్రార్థింపఁగ । వేవేగమ చనుఁడు నేను వెనుకకరిగెదన్॥

ఇంద్రుఁడు—తల్లీ! మహాప్రసాదము. మీరు విజయము చేయుఁడు.

భూదేవి—క్షేత్రపురుషా! ముందు నడువుము. వేత్రవతీ! మనము వెళ్లుదము.

వేత్రవతి—చిత్తము. (అమ్మా! ఇటునిటు)

(అనిమువ్వురు నిష్క్రమించుచున్నారు.)

ఇంద్రుఁడు—(బృహస్పతితో) స్వామీ! మనపై నీభారంబు పెట్టి సర్వంసహాదేవి వెడలెను. మనమిపుర మేగాక యగ్నియమనిఋతివరుణవాయుకుబేరేశానులంగూడఁ గల్పుకొని చతుర్ముఖుని సాన్నిధ్యంబునకుం బోదము. ఆ మహామహుఁడానతిచ్చిన కార్యంబు లెల్లం జేసికొందము.

బృహస్పతి—ఆ! ఇది తగును.

ఇంద్రుఁడు—ఎవఁడురా అక్కడ.

[భటుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

భటుఁడు—అయ్యా! ఏమియాజ్ఞ?

ఇంద్రుఁడు—దిక్పాలుర నెల్ల రాఁబనుపుము.

భటుఁడు—మహాప్రసాదము. (అని నిష్క్రమింపవలెను.)

[పిమ్మట యమవరుణకుబేరులు ప్రవేశించుచున్నారు.]

యముఁడు—దేవేంద్రా! దేవతాసార్వభౌమా! తమయాజ్ఞ యయినదనఁగా నందఱము వచ్చినారము.

ఇంద్రుఁడు—యమవరుణ కుబేరులార! కూర్చుండుఁడు. (కూర్చున్న తర్వాత)

ఇంద్రుఁడు—

తే,గీ॥ భూమిలోనున్న రాక్షసుల్బాధవడంగి । పోకయుంటను నిల్వఁగాలేక భూమి।
యిటకువిచ్చేసి సర్వంబు నెఱుకపఱిచెఁ । గాన మీమీబలంబులు గాంచుటొప్పు॥

యీ రాక్షసభారంబున నగుగుంమనం దాను నిల్వలేనని తెలుపుటపనిగా మహీమహాదేవి యిటకువిచ్చేసి రాక్షససంహారం బాదేశించి చనియె. మీరలేరేని యారక్కసుల నుక్కడంపం దలకొందురా! లేక మన మెల్లరము సేనావ్యూహంబు సమకట్టి పోర జాలుంతమా? మీ యాలోచనలం జెప్పుఁడు.

యముఁడు—ఇంద్రా! మనమందఱమే కాదు. త్రిలోచనుండైన వారలనుక్కడంగింపం జాలఁడని యెన్నెద. వారలవరంబు లట్టివై యున్నయవి.

ఇంద్రుఁడు—వరుణకుబేరులార! మీమీతలంపులేవి?

వరుణుఁడు—దేవేంద్రా! యముని వార్త లొప్పియున్నవి; మన మా ముక్కంటికడకుంజని యాతనిం బ్రార్థింతము.

కుబేరుఁడు—పురుహూతా! మనము దైత్యవిరోధియగు వారిజాక్షుకడకుంబోదము.

ఇంద్రుఁడు—బృహస్పతిగారూ! మీతలంపేమి?

బృహస్పతి—ఇంద్రా! మనమందఱము సత్యలోకంబునకుంజని పద్మజుంగాంచి వినయపూర్వకంబుగ మనకార్యంబు విన్నవించి యాతండేపని నియోగించిన దానింజేయుదము.

[అనఁగానందఋనునిష్క్రమించి బ్రహ్మసభకుపోయి బ్రహ్మయెదుటఁ బ్రవేశించుచున్నారు]

బృహస్పతి—(బ్రహ్మతో) స్వామీ! లోకస్రష్టవగు మీకు నొకసంగతివిన్నవింప నింద్రాది బృందారకులు వచ్చియున్నవారు.

బ్రహ్మ—అందఱుఁ గూర్చుండుఁడు.

ఇంద్రాదులు—చిత్తము.

బ్రహ్మ—(బృహస్పతితో) ఆంగిరసా! వీరలు వచ్చినకార్యమేమి!

బృహస్పతి—స్వామి! జరాసంధ శిశుపాల సాళ్వ యవనశైబ్య పౌండ్రక దంతవక్త్ర కంస చాణూరాదిరాక్షసు లనేకసహస్రాక్షౌహిణీబలయుతులై మృత్యువునొందక పెచ్చు పెరిఁగి తన్ను బాధించుచుండ ఁదానాబాధలోర్వఁజాలననియు నారక్కసుల క్రుక్కిం పవలయుననియు ధాత్రీదేవి స్వర్గంబునకువచ్చి యింద్రుంగోరి యెప్పటియట్లచనియె. తత్కార్యంబుదీర్ప సమర్థులు తమరేకదయని యింద్రాదులు వచ్చినారు.

బ్రహ్మ—ఇంద్రాదులార! మీరువచ్చినకార్యంబు సమకూర్ప నేనుజాలను. వారలు పెక్కు వరంబుల నొందియున్నవారు. వారలవోరింప నాగరుడధ్వజుండుతప్ప వేఱొకరు చాలరు. కావున వారిజాక్షుకడకుంబోయి విన్నవింప నాతండు మనుజుండైపుట్టి వాడిమగంటిమిచే నాయసురల యొసురులఁగొనును. మనము క్షీరాబ్ధికడకుంజని సరసి జాక్షునిసేవించి మనయిక్కట్టులం జెప్పికొందము రండు.

ఇంద్రాదులు—చిత్తము. మహానుగ్రహము.

(అనఁగా నందఱు నిష్క్రమించిరి.)

ఇట్లు పంచమాంకము.

---

## షష్ఠాంకము.

[అటుతర్వాత విశ్వావసుండును, చిత్రరేఖయు విమానముమీఁద సంచరించుచు భూలోక చరితములఁ గనుఁగొనుటకై ప్రవేశించుచున్నారు.]

చిత్రరేఖ—ఆర్యపుత్ర!

క॥ భూలోకచరిత్రంబుల । నాలోకింపంగనాకుహర్షంబొదవెన్ ।
ఏలోకంబులకైనన్ । భూలోకమెవృద్ధికరముపుణ్యాకరణతన్ ॥

ఉత్తరదేశంబున దృష్టినిగుడింపుము. ఈదేశంబెయ్యది!

విశ్వావసు—సఖీ! ఇది ఘూర్జరదేశము.

చిత్రరేఖ—నాథా ! జగన్మోహనకరంబై జితజయంతవసంతకంతునలకూబరంబై లోచనాసేచనక సౌందర్యంబై శృంగారరసంబు మూర్తీభవించిన విధంబువన లోకసామాన్యంబై పరతత్త్వంబువడువున ననిర్ధార్యమాణ స్వరూపప్రకారంబై స్వయంజ్యోతియగు నొక్కమనోహరాకారం బల్లదె లోచనగోచరంబయినయది. ఆమహామహుని సన్నిధికింజని దండవత్ప్రణామంబులొనర్ప మనంబుత్సాహితమగుచున్నయది. గంధర్వజాతి ప్రయుక్తగంధంబడంగి యేమిహేతువో నామనంబామనోహరరూపమనుజుం జేరి మ్రొక్కఁగఁ గాంక్షించుచున్నది. ఈవింత యేమి ? సెలవిండు.

విశ్వావసువు—ఓ కాంతా ! ఆమహాపురుషుండు గరుడవాహనుండు.

చిత్రరేఖ—(భక్తిస్మేషముతో) శ్రీవైకుంఠనగరంబుననుండి విధి శివసనకాదులకైన దర్శనంబీయ నియతండు పరాత్పరుండయ్యును మానుషలోకంబున సకలమనుజనయనవిషయుండెట్లయ్యెను ?

విశ్వావసువు—ప్రియసఖి! వినుము ;

సీ॥ ఆత్మదర్శనమెల్ల నాత్మలకమరంగనవ్యాజకరుణచే నాత్మఁదలఁచి।
తనదర్శనంబిచ్చితగినపూజనలందితనలోకమివ్వంగఁదలచివారి।
కనవరతంబునుహర్షంబులిచ్చుచునందటిలోతానెయవతరించి।
దర్శనస్పర్శనల్లగనొనర్చుచువారియత్యంతభక్తికినాదరించి।
తనదులోకసుఖంబులదయనొసంగ । యుగయుగంబులనవతారయోగమొంది।
దుష్టశిక్షణయునుశిష్టతోషణంబుఁ । జేయునదుఁడగుహరితానెసిద్ధమబల !

మఱియునుఁ “బరిత్రాణాయసాధూనాం వినాశాయచదుష్కృతాం। ధర్మసంస్థాపనార్థాయ సంభవామియుగేయుగే” అని ప్రతినయొనర్చినకతంబున నిత్తఱి నీ మహీలోకంబున యదువంశంబునఁ గృష్ణుండై జనియించినవాఁడు. ఆమహితునిసౌందర్యంబె నీకులోచనాసేచనక మయినది.

చిత్రరేఖ—ఆర్యపుత్ర! ఇప్పు డెవ్వరైనఁ బ్రార్థించిన నావిర్భవించిరా ? లేక స్వేచ్ఛాపూర్వకంబుగ నావిర్భవించిరా ?

విశ్వావసు—ఉ॥ దేవతలెల్లరక్కసులతీవ్రతకోర్వఁగలేకధాతకున్।
వేవినిపింపనాతఁడునువిష్ణునిసన్నిధికేగిమ్రొక్కిన।
ద్భావముతోనుతింపఁగనుభక్తదయాళుఁడుసమ్మతించియి।
చ్ఛావిధిఁగృష్ణుఁడైనెగడెశౌరియపారకృపాక్రమంబునన్॥

భూభారంబు నిర్వహించి నివర్తించుకొఱకు దేవతలెల్లఁబ్రార్థింప దేవకీవసుదేవులకు నందనుండై నందు నిల్లాలు యశోదకడం బెరిఁగి దుష్టరాక్షసులగు పూతనాశకట తృణా

వర్తబకవత్సధేనుకప్రలంబకేశివ్యోమకువలయాపీడ చాణూరముష్టికకంస పంచజనప్ర ముఖులనుక్కడంచి విద్యాభ్యాసంబొనర్చి భీష్మకతనూజాత రుక్మిణింబెండ్లియాడి ద్వారకాపురంబున బలభద్రసహితుండై యున్నవాఁడు. ఇట్లు యుగయుగంబులదేవర్షి కార్యంబులం బాలించుచుండును. మనమును భూలోకంబునకుండిగి శ్రీకృష్ణబలభద్రుల సందర్శించి కృతార్థులమగుదము. (అని క్రిందికిడిగి యిటునటుచూచి) ప్రియసఖి! చూడుము. ఎట్టయెదుట నెవ్వఁడో తపంబు సేయుచున్నవాఁడు.

చిత్రరేఖ—ఆర్యపుత్ర! ఇతండు విష్ణుభక్తుండు కాఁబోలును? దగ్గరంజేరి వందనమొనర్తమా?

విశ్వావసు—ముగ్ధా! అతండు విష్ణుభక్తుఁడు కాఁడు. సూర్యభక్తుఁడు; సౌరోపాసనఁ జేయుచున్నాఁడు.

చిత్రరేఖ—తే,గీ॥ ఏమియాశ్చర్యమిది? నాథ! యీతఁడుర్వి।
సకలసులభతఁబద్మలోచనుఁడెయుండ।
సర్వశక్తునివిడనాడిస్వల్పశక్తి।
యుక్తుసూరస్థునెట్లుదానోమెరవిని॥

పరాత్పరుండైయపునరావృత్తిపదం బిచ్చుటకై శ్రీమన్నారాయణుం డవతరించి తన యూరనేయుండ నీతనికిట్టి యజ్ఞానోత్పత్తిరాఁగతంబేమి?

విశ్వావసు—క॥అతఁడర్థకాముపరుఁడై । వితథంబుగఁదపమొనర్చి వేల్పులగమిచే।
నతితుచ్ఛములగుకోర్కెలఁగుతుకంబునఁబొందియుండుఁగుచ్ఛితుఁడౌటన్॥

ధనపిశాచాయత్తచిత్తుండై సూర్యునారాధించుచున్నవాఁడు.

చిత్రరేఖ—భగవత్సన్నిధియున్నను జనులు భగవత్పరులుగాక యన్యదేవతాపరులేల కావలెను? చేతనులరక్షింప నవతరించిన శ్రీకృష్ణు లీతపసింగావలేరా? అది యేమి?

విశ్వావసు—అనాదికర్మవాసనావశంబునఁ గొందఱు భగవత్పరులు కానేరరు వారికిజన్మంబులనేకంబులుగలిగి సంసారచక్రంబునఁ బరిభ్రమింతురు.

చిత్రరేఖ—ఇట్టివారికెప్పటికైన ముక్తికలుగునా?

విశ్వావసు—భగవంతుని నిర్వ్యాజకృప, యెప్పుడిట్టివారియందుఁ బ్రసరించునో యప్పుడె "జాయమానంహిపురుషం యంపశ్యేన్మధుసూదనః। సాత్వికస్సతువిజ్ఞేయస్సవైమోక్షార్థచింతకః॥"అను న్యాయంబున భగవత్పరులై పరమభక్తియుక్తులై జన్మరాహిత్యమైన శుద్ధసత్వపరమపదవిం బొందుదురు.

చిత్రరేఖ—ఆర్యపుత్ర! అది యటుండనిండు; ఇట్లు సూర్యోపాస్తి చేయుచున్నవాఁడెవ్వాఁడు?

విశ్వావసు—కాంతా! ఇతండు సత్రాజిత్తు; మధురాపురవాసియయ్యును శ్రీకృష్ణులతోఁ ద్వారకం బ్రవేశించియున్నాఁడు. సూర్యునారాధించి స్యమంతకమణిం బడయును; అవ ణి దినదినంబును శతభారంబుల కాంచనంబొసంగును. దానంజేసి ధనపూర్ణుండయి కృష్ణుందెగడ వేఁచియున్నవాఁడు.

చిత్రరేఖ—ఆర్యపుత్ర! ఇది మఱియు వింతయయ్యె; చేతనునకు భగవంతునిపై భక్తిలేకున్ననుండుఁగాక. వారివిషయమున నపరాధము చేయఁదలంచుటయుంగూడ నతిపాపావహము; నాథా! యట్లైన వీరికి ననతిదూరకాలంబున నాపదరాఁబోవుచున్నది.

విశ్వావసు—కాంతా! చూడుమల్లదె భాస్కరుండు సత్రాజిత్తునకు వరంబియ్య భూతలంబున కవతరించుచున్నాఁడు.

చిత్రరేఖ—(చూచుచు,) ప్రాణనాథా! రెండవసూర్యునివలెఁ బ్రకాశించు నవ్వస్తువెద్ది?

విశ్వావసు—అదియె స్యమంతకమణి.

చిత్రరేఖ—అట్లయ్యేనేని నచటిచిత్రంబులాలోకింతముగమ్ము (అనఁగా నిరువురు నిష్క్రమించిరి.)

ఇది చూళిక.

శ్రీకృష్ణబలరాముల కచేహరి (ద్వారకాపురము.)

[పిమ్మట-శ్రీకృష్ణుఁడు బలరాముఁడు-ఉద్ధవుఁడును బ్రవేశించుచున్నారు.]

శ్రీకృష్ణుఁడు—బలరామమూర్తీ! మనమీలోకంబున నవతరించిన కార్యంబులలోఁ గంసుని వధతో ననేకకార్యంబులు ముగిసినవి. ఇంకను జరాసంధ శిశుపాల పంతవక్త్రసాళ్వ పౌండ్రక దుర్యోధనులున్నవారు. జరాసంధుండు సహస్రాక్షౌహిణీసేనాసమేతుండు. సేనలనన్నిఁటిఁ బొరిగొనినఁగాని జరాసంధుం జంపఁదగదు. అదియునుంగాక వానిని మనము చంపక, భీమసేనునిచేఁ జంపింపవలయును. అట్లైన నాతనిచే ననేకులగు నమరవైరులు సమయుదురు. కాలయవనుం బరిమార్ప ముచికుందుం బనిచితిమి. ఆపనియుం గడతేరె. మీరును రాక్షససంహారంబొనర్ప సహాయులైయుంటిరిగద!!

బలరాముఁడు—సోదరా! నీసంకల్పంబునకు వికల్పంబు గలుగునా? పూర్వభవంబున నీవు నాకగ్రజుండవైనప్పుడు నీకు నేననుజుండనై నీకుం గైంకర్యంబులొనర్చితిని. ఈ జన్మంబున నీవు నాకనుజుండవై నన్నుంబూజించెదవు. నీచర్యలనెన్న నెవ్వరితరంబు! నీకగ్రజుండనైనను నీమీఁది ప్రేమచేత నీయిష్టంబులఁ జేయందలంచెద. నాకు నిష్టంబులైనను నీకు విపరీతంబులయ్యేనేని వానింగావింపం దలంకొనను.

శ్రీకృష్ణుఁడు—అగ్రజా మీయనుగ్రహంబునకు మేరలేదు.

ఉద్ధవా! పితృవ్యా! మీమంత్రాలోచన మమ్ముల జయింపఁజేయుచున్నది. మీరెల్లప్పుడు మాయందుఁ బ్రేమకలిగి యుండుటంజేసి మేము కృతకృత్యులమగుచున్నాము.

ఉద్ధవుఁడు—స్వామీ! నాయందుఁగల దయావిశేషంబువలనఁ దమరీలాగున ననుచున్నారుగాని మీయభిమతమున కేనెంతవాఁడను.

(ఇంతలో సత్యకుఁడు ప్రవేశించి)

సత్యకుఁడు—స్వామిన్! దయానిధీ! మీరు మాయదుకులంబునం బుట్టినవారయ్యును బరమపురుషు లగుటచేత మిమ్ముసేవింప బ్రహ్మరుద్రాఖండల బ్రహ్మర్షి దేవర్షిముఖ్యులు వచ్చుచుఁ బోవుచునుందురుగద? ఆవిధంబచ్చుపడ నేఁడు, సూర్యుండో శిఖియో సుధాంశుఁడో యజ్ఞానసుండో మఱి యేతేజశ్శాలియో మీదర్శనంబునకునవ్వచ్చుచున్న వాఁడు. వానితేజంబు మాకన్నులకు మిఱుమిట్లు గొల్పుటంజేసి చూడ భయంబందుచున్నవారము. అట్లుంగాక యిది యొకయసురమాయయో? మీరే యారసి మమ్ముం గాపాడ సమర్థులు.

శ్రీకృష్ణుఁడు—(కొంచెముసేపు ధ్యానించి) పితామహా! మఱి యెవ్వరుగాను; మన సత్రాజిత్తు; సూర్యునారాధించి సూర్యునివరంబున మణినిజెంది మణిసహితుండై వచ్చుచున్నవాఁడు; ఆతేజస్సు స్యమంతకమణి కాంతియైయున్నది.

సత్యకుఁడు—స్వామీ! ఆమణి యేమిచేయఁగలదు. ఇంతకాలంబునుండి తపంబొనర్చి "కొండత్రవ్వియు నెలుకనుగొనుటయయ్యె" అను నట్లొకమణిని సంపాదించినందున నీతండు పొందిన ఫలమెద్ది? ఏమిలాభము సంపాదించినట్లు?

శ్రీకృష్ణుఁడు—తాతా! అట్లుకాదు; ఆమణికి నిత్యంబును షోడశోపచారములతోఁ బూజసల్పినచో నద్దాన దినదినంబును నూరుభారములకాంచనంబు లభియించును; సత్రాజిత్తుం డందుచే నైశ్వర్యయుక్తుండై మమ్ము ధిక్కరింప వేఁచియున్నాఁడు.

సత్యకుఁడు—బ్రహ్మయు నింద్రుండును నిన్నుం బరీక్షించి బాగుగానే వారిఫలముల నొందిరి గద! ఇంక నీతండు పరీక్షించువాఁడు.

శ్రీకృష్ణుఁడు—రానిమ్ము; వచ్చినతోడనే యన్నియుం దెలియును. నీవుపోయి జనులభయంబుడుపుము.

సత్యకుఁడు—మంచిది ఆలాగె చేసెదను. (అని నిష్క్రమించుచున్నాఁడు.)

(తెరలో బిగ్గరగా)

ఓహెూ రాజపురుషులార!

గీ॥ సూర్యుఁగూర్చి సత్రాజిత్తుసుస్థిరుఁడయి । తప మొనర్చిమహోరాజుఁదరియవచ్చె।
మణిసహితుఁడయిమందిరాంగణముపురముఁ । దగునలంకార మొనరింపఁదగినవారు॥

ఉద్ధవుఁడు—శ్రీకృష్ణా! బలరామా! సత్రాజిత్తు బహుకాలంబు దపంబొనర్చి మణిసహితుం డై నేటికాలంబునకు స్వగృహంబునకు వచ్చెను. మనపట్టణంబుననున్న వాఁడగుటంజేసి యతని సంతోషసమయమున మనమును సంతోషింపవలసినదేగద! అచ్చటికందఱము పోవుదమా?

శ్రీకృష్ణుఁడు—ఉద్ధవా! నీమాటలు సర్వసమ్మతములు. అయినను సత్రాజిత్తు మణిప్రతిష్ఠాది శుభములఁ జేయంబోవుచు, అతండే మనల నాహ్వానంబు సేయుచు. అనంతర మచటి టికిం బోదము; అంతవఱకు శిశుపాల జరాసంధ జిగీషాయత్తచిత్తులమై యుంద యుందము.

(తిరిగి తెరలో బిగ్గరగా)

ఓహెూ రాజపురుషులార!

గీ॥ సూర్యుఁగూర్చి సత్రాజిత్తుసుస్థిరుఁడయి । తపమొనర్చిమహారాజుఁదరియవచ్చె।
మణిసహితుఁడయిమందిరాంగణముపురముఁ । దగునలంకారమొనరింపఁదగినవారు॥

అదుగో సత్రాజిత్తువచ్చు నుత్సవంబునకుఁ గార్యపరులు మాట్లాడుచున్నారు. మనము నాలోచించుటకు నంతర్గృహంబునకుం బోధము. (అని నిష్క్రమించిరి.)

సత్రాజిత్తు మందిరము.

[పిమ్మట మణిసహితుండై సత్రాజిత్తురాఁగాఁ బ్రసేనుండును మంత్రులును నెదురుగ నేగి నమస్కరింపఁగవచ్చి యందఱును సభాసీనులగుచున్నారు.]

సత్రాజిత్తు—సోదరా! ప్రసేనా! ఇటురమ్ము; (అని దగ్గరకు చేరతీసికొని) మంత్రులారా! మీయనుమతంబున నాఁడట్లు వనంబునకుంజని యరవిందబాంధవుంగుఱించి తపంబొనర్చి సూర్యానుగ్రహాతిశయంబున స్యమంతకరత్నంబునొంది సంతసంబున నరుదెంచితి; మనరాజ్యంబునఁ బ్రజలందఱు సుఖులైయున్నవారుగదా? ప్రసేనా! నగరున మీవదినెయు బాలికయుఁ గుశలులెగద! మంత్రులార! ప్రకృతి మండలంబెల్లకుశలంబె గద!

మంత్రులు—మహారాజ! మీతపశ్చర్యాక్రమంబును స్యమంతకాదానభంగియు వినంగోరుచున్నారము.

సత్రాజిత్తు—విను సచివోత్తమ! వివరింతు; దినమణి, కృపచేతఁ బడసిన వృత్తమెల్ల సతినిష్ఠతో నేను హరిదశ్వునెదుటఁ దపంబుసల్పుచునుండ భాస్కరుండు తిగ్మాంశువులడంచి తేజస్స్వరూపియై సాక్షాత్కరించి తాఁజతురముగను “వత్స! చాలుఁదపంబు; వరమొసంగెదవేడు”మనిపల్క దనమంచునడిగినంత,

తే, గీ॥ మణివరంబిదినీకిచ్చుమహితధనము । లింకదీనినిగొనిచనిశంకదక్కి।
దేవతార్చనవిధిఁబూజావిధాన । మమరఁజేయుమునిత్య హేమాళినిచ్చు॥

మఱియు

క॥ దినముశతభారమితముగఁ । గనకంబొడఁగూర్చునీకుఁగలఁగకుమింకన్।
ఘనమగుశుచిత్వమెడలిన । ననిష్టమగునీకునిష్ఠదలఁగకుమెపుడున్॥

క॥ మణినిధరింపఁగఁదలఁచిన । క్షణమైననుశుచితవిడువఁజనదెప్డుమహిన్।
అణుమాత్రమైనశుచితా । గుణమెడలినఁగీడు; నిజముగుణరత్ననిధీ॥

ప్రమాదంబున దీనినిధరించి గ్రామబహిప్రదేశంబున కేగిన వానికి మరణంబు సిద్ధంబు. ఇయ్యది దీనివృత్తాంతంబు. రేపకడే దీనిని గృహంబునఁ బ్రతిష్ఠ సేయవలయును. తగిన సంభారంబులం గూర్పింపుము. నేను నంతఃపురంబునకుం జనియెద.

(ననఁగా సత్రాజిత్తు, ప్రసేనుండును నిష్క్రమించుచున్నారు.)

మంత్రి—ఎవఁడురా ద్వారమున?

[సేనాధిపతి ప్రవేశించి.]

సేనాధిపతి—అయ్యా! వీఁడె తమసేనాని.

మంత్రి—క॥ రేపకడస్యమంతకమణి । నైపుణ్యముతోఁబ్రతిష్ఠనరనాథుఁడొగిన్।
పాపరహితగురువులకృప । కాపాడఁగఁజేయుఁగానఘనముగనీవున్॥

తే, గీ॥ గర్గసంయమికడకేగికాంచిమ్రొక్కి । వర్గములుగాఁగఁజెప్పినవస్తుసమితి।
దుర్గమునఁజేర్పుమొయ్యనఁదుష్టితోడ । వర్గములుగాఁగభటులెల్లవలయునిలుప॥

సేనాధిపతి—మహానుగ్రహము. మంత్రిసత్తమ! (అని నిష్క్రమించుచున్నాఁడు.)

[పిమ్మట దేవతామందిరమున మణితోడ సత్రాజిత్తుండును గర్గమహర్షియు సభికులును ప్రవేశించుచున్నారు.]

సత్రాజిత్తు—

తే, గీ॥ సంయమీశ్వరమీయాజ్ఞచయ్యనఁగొని । సూర్యువరమందివచ్చితిసూరివర్య।
మణిఁబ్రతిష్ఠింపవలయునుమానివర్య । దేవతార్చనమందునదివ్యముగను॥

మహర్షిసత్తమా! దీనిగృహ్యోక్తప్రకారంబున దేవతామందిరమునఁ బ్రతిష్ఠింపుము.

గర్గుఁడు—రాజా మిగుల సంతుష్టుండనైతిని. నీయిష్టప్రకారమే, కావించెద.

సభికులారా! అనుజ్ఞయిచ్చెదరా?

సభికులు—అద్యం ముహూర్తస్సుముహూర్తోఽస్తు.

గర్గుఁడు—పూజించి. శ్లో॥ ఆదిత్యాయనమస్తుభ్యంఛాందసజ్యోతిషేనమః।
ఆవిర్భావస్వరత్నేస్మిన్ గృహాణమమపూజనమ్॥

క॥ ఓరవియత్యాదరమున । నీరత్నమునందునిలిచినిచ్చలుమాకున్।
గోరికలూనఁగుముకడుకృప । ధీరతవరమొసఁగినట్టిదేవరవుగదే॥

రాజా! ప్రతిష్ఠచేసి పూజకావించినాఁడను.

(అందఱును ఆనందించుచున్నారు.)

(ఇట్లు పూజానంతరమున సర్వజనులును నిష్క్రమించిరి.)

[పిమ్మట శ్రీకృష్ణుండును బలరామోద్ధవులును ప్రవేశించుచున్నారు.]

కృష్ణుఁడు—ఉద్ధవా! శిశుపాల జరాసంధుల సంహరించు వార్తలు శతమఘుండు సందేశించెను. రాజసూయాధ్వర ప్రవర్తకుఁడై ధర్మసూనుండాహ్వానమొనరించెను. ఏకార్యంబునకుఁ బోవుటకును, స్థిరచిత్తుఁడనై యేర్పఱుపనేరకున్నాఁడను. నీవాలోచించి యొద్దిపంచినను జేయంగలవాఁడను.

ఉద్ధవుఁడు—శ్రీకృష్ణా! వినుము.

ఉ॥ భీమునిబార్థునింగొనుచుబీరమెలర్పగిరివ్రజంబును।
ద్దామతనేగియచ్చటనుధర్మమెలర్పఁగనాజరాసుతున్।
భీమహితున్మసుత్సుతునిదేజమెలర్పఁగఁబోరఁజేసిను।
త్రామఁడుమెచ్చమర్దితుసురాజకమర్దనుఁజేతువాజిలోన్॥

మఱియు.

ఉ॥ ధర్మసుతుండుదిక్కులనుదగ్రతగెల్చితదార్జితంబులౌ।
నిర్మలకాంచనౌఘములనిష్ఠనొనర్చునురాజసూయమున్।
పేర్మినిరాజులందఱును బెక్కగవత్తురుదానిఁజూడఁగాఁ।
గూర్మినినీదుశత్రుఁడునుగూడినవాతనినొంపనిమ్మగున్॥

బలరామా! మీయభిమతంబేమి?

బలరాముఁడు—ఉద్ధవా! పితృవ్యులగు మీయాలోచనయే మాకు శ్రేయస్కరంబు.

(ఇంతట తెఱలో బిగ్గరగా)

శా॥ సత్రాజిన్నృపశేఖరుండుమణిన్ స్థాపించినేఁడొప్పుగా।
విత్రాసత్వమునొందబ్రాహ్మణులువిద్వేషుల్భయంబందఁగా।
సత్రాశుల్ముదమొందభూసురులకున్సర్వస్వమున్నిచ్చెఁబో।
గోత్రన్ భూమిపులెవ్వరేనొసఁగిరేకోట్యర్థమీరీతిగన్॥

వ॥ ఇట్టిధర్మాత్ములేరును లేరుసుమా.

శ్రీకృష్ణుఁడు—

తే-గీ॥ అన్న బలరామసత్రాజిదనఘ ర్త । మణినిస్థాపించివిప్రులమణిగణములఁ।
బూజసల్పుటవినఁబడెమోదమయ్యెఁ । గానఁబోవుదమాచోటుగాఁచుటకును॥

(అనఁగా నందఱు నిష్క్రమించిరి.)

ఇట్లు షష్ఠాంకము.

---

## సప్తమాంకము.

సత్రాజిత్తుయొక్క మందిరము.

[సత్రాజిత్తుఁడును బ్రసేనుఁడును బ్రవేశించుచున్నారు.]

సత్రాజిత్తు—ప్రసేనా! సహోదరా! నీకు స్వాగతమేగద? వింతలేమైనఁగలవా!

ప్రసేనుఁడు—అగ్రజా! తాము మమ్మందఱఁ గాపాడుచుండ మాకుసుఖంబునకేమికొఱంత!

సత్రాజిత్తు—అనుజా! నిన్నుఁజూడఁగా నెద్దియో యభిమతంబడుగఁదలంచివచ్చి యడుగుట కనుమానించుచున్నవానివలెఁ గాన్పించెదు. ఎద్దియైనఁ గలిగిన ననుమానింపక యడుగుము.

ప్రసేనుఁడు—ఆర్య! తాము కనిపెట్టినయంశము నిజమేను. పాండిత్యంబన నిట్టిదియేకద! “పరేంగితజ్ఞాన ఫలాహిబుద్ధయః” అనిగదా ప్రాజ్ఞులుగ్గడింతురు! తమవిశేషప్రజ్ఞతఁ గొనియాడ నే నెంతవాఁడ. నన్ను మన్నించి నాయభిమతం బొడఁగూర్తురేని విన్నవించెద.

సత్రాజిత్తు—ప్రియసోదరా! నాకు నీకన్న వేఱుప్రియులుగలరా! నీయభీష్టమును దాఁచక చెప్పుము.

ప్రసేనుఁడు—అగ్రజా! తాము సూర్యునివరమువలన సంపాదించితెచ్చిన స్యమంతకమణిని గంఠంబునధరియించి వేఁటకేగవలయునని నాకోరికయయియున్నది.

సత్రాజిత్తు—సోదరా! వినుము.

చ॥ అనుజుఁడవైననీకొసఁగనబ్బురమేమియులేదుగాని,యై।
ననువినుమొక్కమాటనుజనార్దనుఁడెప్పుడుదీనిఁజెందఁగా।
ఁదినమునుగాఁచియుండునతితీవ్రతదీనిహరించునెమ్మెయిన్।
మనమునశంకనొందెదనుమానుము వేఁటకుఁబోవదీనితోన్॥

అనుజా దనమణి మణింధరించికొని యింటనేయుండుము. వేఁటకుం బోవలదు.

ప్రసేనుఁడు—స్వామీ! మణినపహరించునని మీరందునెడ సంశయంబువలదు; వినుఁడు.

మ॥ జలజాతాక్షునకిట్టి రత్నములు నెంచంజాలఁగాఁగల్గదుఁ
విలసద్విశ్వములోనఁ గల్గుమణికిన్ విశ్వంభరుం డెంచునా!
జలధిన్ బుట్టినకౌస్తుభంబుగలుగన్ జర్చించు నేయన్యముల్
బలిమిన్ జేకొనె నేనిభక్తిసలుపన్ బ్రఖ్యాతితో నిచ్చెదుల్॥

క॥ వనజాక్షునికతమునవిను । మనఘా! యెన్నఁడును మణికినభయం బెకడున్।
దనుజాంతకుఁడైయుంటను । మనుజుల తెఱ్వనకురాఁడుమాధవుఁడుకృపన్॥

కావున వేఁటకుంబోవ సెలవొసంగుఁడు.

సత్రాజిత్తు—(మణి నొసంగి) సోదరా! వేఁటకుంబోయి తడవుండక శీఘ్రమునరమ్ము.

ప్రసేనుఁడు—చిత్తము. అటులనే కావించెద.

(అని యిరువురు నిష్క్రమించుచున్నారు.)

ఇది ప్రరోచన.

[పిమ్మట సత్రాజిత్తు మంత్రియును బ్రవేశించుచున్నారు.]

సత్రాజిత్తు—ఏమి మంత్రీ! (దిగులుతో) నిన్నటిదినంబునఁ బ్రసేనుం డటవికి వేఁటకేగి మరల రాఁడాయెను! ఏమి మంత్రీ! నాకు మిక్కిలి దుఃఖముకలుగుచున్నది. ఆలోచనచేసి చెప్పుము.

మంత్రి—మహారాజ! వేఁటాఁడ వెళ్లినవారు మృగయూథంబులం బరిమార్చ సందడిసంతయు మఱచి కొన్నిదినంబు లాలస్యము చేయుటయుఁగలదు. ఒకదినమాలస్యమునకే వగవనేల! మహాప్రభో.

సత్రాజిత్తు—

ఉ॥ ఊరక వేఁటకుంజనిననూరడియుండు స్యమంతకంబుఁదాఁ।
గోరికఁ గంఠమందుఁగడుఁగూర్మిధరించినకారణంబునన్।
గ్రూరులు దానికై యతనిఁగోపముతో డుతనేమి సేతురో!
దారుణభంగిదానికినిదండడి దుఃఖముగ్రమ్ముచుండెడున్॥

ఇంకొక్కటి పిడుగువంటి వార్తయున్నది. (అని మంత్రిచెవియొద్ద రహస్యముగా) వాసుదేవుండీమణినపహరింప వేచియున్నవాఁడు. అతఁడు శూరుఁడును గ్రూరుఁడును; ఇది పెద్దదిగులుగానున్నది.

మంత్రి—అట్లయినపక్షమున వేఁటదారింబట్టి పోయి యడవిలో నాతని నన్వేషింపందగిన వాలరులం బంపుదము.

సత్రాజిత్తు—సరి; అటులఁగావింపుము.

మంత్రి—చిత్తము. ఎవఁడురా ద్వారమున?

[భటుఁడు ప్రవేశించి.]

భటుఁడు—అయ్యా! తమనవుకరున్న వాఁడు.

మంత్రి—వరే! నీవుపోయి వేగవంతునితోఁజెప్పుము. అడవికి వేఁటకుఁజనిన ప్రసేనమహారాజుగారిజాడ కనుఁగొనిరమ్మని.

భటుఁడు—చిత్తము. (అని నిష్క్రమించుచున్నాఁడు)

సత్రాజిత్తు—మంత్రీ! నాకేమియుఁ దోఁచడములేదు.

క॥ ధరమణిపోయినఁబోనీ । ధరసుగుణుఁడుతమ్ముఁడైనదక్కనొలేదో।
గిరిగహనసంకటంబుల । హరిహరియేమయ్యెనొక్కొ! యరులనరములన్॥

ఆ-వె॥ మణినిగంఠమందుమక్కువధరియించి । గుణగరిష్ఠుఁడేగెఁగోనకిపుడు।
నాయదృష్టమెట్లునడచునోదైవమా । యీదలేనుదుఃఖమిపుడుమంత్రి!॥

మంత్రి—మహారాజ! ఊఱడుము. ఇంతలో వార్తాహారి రాఁగలండు నిజముతెలియును.
మఱి, యొకమనవిగలదు.

ఆ-వె॥ రాజచంద్రమీరురత్నంబుఁదెచ్చిన । సమయముననువార్తజరిపినారు।
మణిధరించిబయటనణుమాత్రమైనను । జనినఁగీడువచ్చుననుచునాఁడు॥

ఇట్టిసంగతి నెట్టుమఱచితిరో! తెలియకుండినది.

సత్రాజిత్తు—

మ॥ సదివా! భాస్కరువాక్యము న్మఱచితిన్ సౌభాగ్యహీనుండనై।
సుచరిత్రున్ సుగుణాఢ్యుసోదరునిజిచ్ఛాన్యుండనైచావఁగా।
నుచితంబైనవిధిన్మణిన్దలఁపలేకుత్సాహినైపంచితిన్।
రుచిరాయైమమర్మరణంబువానికిటురారూపించెఁగాలంబయో॥

(రోదనముతో) మంత్రీ!

గీ॥ మున్నునీతోడఁజెప్పినమొదటిమాట । గానియీవార్తయేచిత్తగతికిరాదు।
ఏమిసేయుదునిక్కనాకెవ్వరింక । దైవమా! యెంతచేసితిదడవితడవి॥

సోదరునిచేఁ జేతంజాపుకొంటి నయ్యయో! అని విలపించుచు (క్రిందపడెను.)

మంత్రి—మహారాజ! ధైర్యంబవలంబింపుఁడు.

మ॥ వినుమహారాజవరేణ్యకర్మఫలముల్వెన్నాడివర్తించుచున్।
జనులన్మోసమునొందఁజేయుచునుదంచత్ప్రక్రియన్వర్తిలున్।

గను నే దైవహతుండు కార్యములవక్రత్వంబుల న్నెందు నె।
వ్వనికిన్ గర్తగలాఁడె! కర్మగమిత ప్రారబ్ధముల్ లోకముల్॥

కాఁబట్టి, మహారాజ "విపది ధైర్య" మను న్యాయం బవలంబింపుఁడు.

[ఇంతలో వేగవంతుఁడు ప్రవేశించుచున్నాఁడు]

వేగవంతుఁడు—మహామంత్రిపుంగవ! నాదు వందనం బంగీకరింపుము.

మంత్రి—ఏమిరా వార్తలు?

వేగ—నేను తమయాజ్ఞానుసారముగ నడవి కేగియేగి గుఱ్ఱపుటడుగులజాడ బడినిబడిపడినడచి. కొంతవడికి బంచత్వ మొంది పుడమింబడియున్న యీని కత్తలానిం బొడగంటిని. అంతట మఱికొంతదూరంబేగి యట మహారాజప్రసేనులం...... (దుఃఖముతో మాటలాడ నేరకయూరకుండవలెను.)

మంత్రి—ఏమి! అక్కటా! ఆయనకును గుఱ్ఱపు గతియేనా! ఏమి! అయ్యో! అయ్యో!! (రాజుకడకుం బోయి,) తమసోదరుఁడు మాయువరాజు తమను మమ్మును విడిచి......(దుఃఖము సూచించుచుఁ గొంత సేపూరకుండి) లోకాంతర గతుఁడయ్యెను.

సత్రాజిత్తు—(మూర్ఛపోయినట్లు పడుచున్నాఁడు.)

మంత్రి—మహారాజ! నిశ్వసింపుము (అని విసరుచున్నాఁడు.)

సత్రాజిత్తు—లేచి! ఏమిరా! వేగవంతా! జగ్గిన సంగతి చెప్పుము.

వేగ—మహారాజ! సావధానముగఁ జిత్తగింపుఁడు.

సీ॥ తమయాజ్ఞఁబూనియంతటఁగానకేగియచ్చటగుఱ్ఱపడుగులజాడఁగంటి।
జాడ వెంబడ్డిపోఁగ సమసినగుఱ్ఱంబుపడియుం డెనంతటఁ బ్రభువుజాడ।
నడుగులఁగనుఁగొనియటుపోవఁగాఁగొంతవడికిఁగన్గొంటినిబడినవిభుని।
నచ్చటశోకించియవలి కేగితివార్తదెలియుట కైయటఁ ద్రెళ్లసింగ।
మచటమణిఁగానసైతినిమనుజపాల । విభుఁడుదనుగొట్టసింగమువిభునిగొట్టి।
యేగసిద్వరువడిరిచెయ్యేదియచటి । మణినిగొనిచని రెవ్వరేమనుజపాల॥

ఇది నాకాంచిన తెఱంగు. పిమ్మట ప్రభువువారే ప్రమాణము.

మంత్రి—వేగవంతా! మంచిది. నీకుఁగల పనులం జక్కపెట్టుకొనుము.

వేగ—మహానుగ్రహము. (అని నిష్క్రమించుచున్నాఁడు.)

సత్రాజిత్తు—(దుఃఖముతో) మంత్రీ! ఇది యాలోచింతము నాకుం దోఁచిన తెఱంగెఱింగించెద వినుము.

సీ॥ ఇదికృష్ణుపనిగానియితరులకార్యంబుగాదయ్యసచివ,జగంబునందు।
నతఁడుమాయావిచరాచరద్రోహియౌ,సంశయమేమి,యస్త్రశస్త్రజాతు।
సోదరుఁజంపియుసొంపైనమణిఁగొనిసింగంబుఁజంపితాఁజెందెగృహముఁ,।
గనుఁగొనువారుసింగముచేతయనుకొనఁనీకపటంబునునిచ్చజేసె,।
నీతిలేనివాఁడునిజమైనటక్కరి । గోపకులనునెల్లగోలుపుచ్చి।
వెన్నదొంగలించివీఁగినాఁడీతఁడు, । కోరెనేనిమణినిగూర్మినీనె?

క॥ నాతమ్మునిజంపినతన । కేతన్మాత్రమునఁగీర్తియెంతప్రబలునో?
చూతమ్మిఁకనైననునని । జాతములగునయ్యచోరసద్గుణములిలన్॥

నిక్కముగ వానవనీతచోరుండే మణికిన్నదీయానుజుం జక్కాడినవాఁడు.

మంత్రి—ఎవనిమనము లెట్లుండునో?

ఆ, వె॥ ఎవనిమనములెవనికెఱుఁగవచ్చునుభువి । నెంతవారలైననిలనుగలరు।
కాంతపైనియాశకనకంబుపైనాశ । లేనివాఁడుపుడమిలేఁడునమ్ము॥

రాజా! కనుకనే «వేధాద్వేధాభ్రమంచక్రే కాంతాసుకనకేషుచ” అని పెద్దలు వచించెదరు. మనమిఁక సుతమరణశోకాక్రాంతురాలగు మాతృసన్నిధికిం బోవుదము.

(అని యిరువురు నిష్క్రమించుచున్నారు)

[పిమ్మట శ్రీకృష్ణుఁడును ఉద్ధవ బలరాములును ప్రవేశించుచున్నారు.]

శ్రీకృష్ణుఁడు—ఉద్ధవా! సత్రాజిత్తు నాపై నపనిందల మోపినాఁడు వింటివా?

క॥ తనతమ్మునిఁజంపితినని । తనమణిఁగైకొంటిననియుఁదద్దయునిందల్।
ఘనముగసత్రాజిత్తుఁడు । ననుమోపెడు నేమిసేతున్యాయముసెపుమా॥

క॥ ఏవార్తయునెఱుఁగనినను । నీవాక్యములేలఁబల్కెనీతఁడువగతో।
నేవసుదేవునితనయుఁడ । నైవినుదునెయిట్టినిందలఘుగణదూర॥

ఉద్ధవుఁడు—

గీ॥ కుక్షినిజగంబులుగలట్టికుధరధారి । వైననీకునునిందలాయబ్జనాభ।
చెదలునిప్పునకంటునాక్షితిని నెందు । వట్టినిందలనీకేలవనట! కృష్ణా॥

శ్రీకృ—అదియెంతయుసరేలే! ఏమియునెఱుఁగని నామీఁదికేల యీ యపనిందలు రావలయును.

ఉద్ధవుఁడు—స్వామీ! సర్వజ్ఞులు. తమరెఱుఁగనియర్థ మీ లోకత్రయంబునం గల్గునా? లోకస్థితిని విన్నవించెద నాఁకొనుఁడు.

క॥ సర్వజ్ఞులుమీరెఱుఁగని । పుర్వారఁగలవెట్లుకార్యయుక్తులుతగనా।
శర్వతనూభవుచవితిని । గర్వంబునఁజంద్రుఁజూడఁగడునిందలగున్॥

కావున మీరలెప్పుడైన వినాయకచతుర్థీ నిశాముఖంబునఁ జంద్రుం గాంచితిరేమో ?

శ్రీకృ—ఆ! అవును. బాగుగ జ్ఞాపకము చేసినవాఁడవైతివి, వినుము.

క॥ జ్ఞాపకమువచ్చెనిపుడో । పాపహరణచవితినాఁడుపాల్గలగిన్నెన్।
జూపునఁగనుఁగొంటినిశశి । రూపునుసౌధంబులోనరుక్మిణిచెంతన్॥

ఉద్ధవుఁడు—తమకును లోకనిందలా !

శ్రీకృష్ణుఁడు—

క॥ మనుజులలోఁబుట్టినతఱి । మనుకులధర్మంబొనర్పమహితంబగుటన్।
వినునిందగలిగెఁగాదీ । నినిబాపఁగయత్నమిపుడ నేర్పునఁజేతున్॥

కావున మణిని వెదుకఁబోయి యెందున్నను గొని మఱలవలయును నాతోడం గొందఱ జనుల రానియమింపుము.

ఉద్ధవుఁడు—స్వామి ! చిత్తమునగల యట్లే కావించెద. ఎవఁడు రా! ద్వారమున ?

సేవకుఁడు—అయ్యా ! సేవకుఁడున్నవాఁడు.

ఉద్ధవుఁడు—అరే ! స్యమంతకమన్వేషణమునకై స్వామివారరణ్యమునకుం బోవుచున్నారు. కొంతసైన్యంబుందిసికొని వారితోఁ బోవలసియున్నది గాన సేనాసహితంబుగ నుండుఁడని సేనానులతోఁ జెప్పుము.

సేవకుఁడు—అయ్యా ! చిత్తము. (అని వెళ్ళుచున్నాఁడు.)

శ్రీకృ—ఉద్ధవా ! నీవును, మాయన్నగారును నగరరక్షణార్థమై యుండుఁడు. నేను స్యమంతకమణినన్వేషించుపొంటె యడవికేగి ప్రసేనుని మార్గంబు బట్టిపోయివెదకి మణిం గొనివచ్చెద. అన్నగారు ! తమరు పురరక్షణంబునకై నిల్వుఁడు. మీరును నేనును లేకున్న, తఱివేచి, రిపులుదాడి వెడలుదురు. కావున మిమ్ము నిందునుండఁ గోరుచున్నాఁడ.

బలరాముఁడు—చిన్నకృష్ణా ! నీతలంచిన భంగియే యగును.

(అని బలరామోద్ధవులు నిష్క్రమించుచున్నారు,)

[శ్రీకృష్ణుండు నిటునటు తిరుగుచుండఁగా సేనాధిపతి ప్రవేశించుచున్నాఁడు.]

సేనాధిపతి—స్వామి ! గోపాలచక్రవర్తి ! విజయీభవ. అని వందనముచేయుచున్నాఁడు.

శ్రీకృ—సేనాధిపా ! మనమీయెడ వెదుకంబోదము. కాననంబు నలుదిక్కుల న్వెదక సేనలం బంపితివిగద !

సేనాని—నాయేలిన దైవమా! యదుకులసార్వభౌమ! సేనల నన్నిదిక్కుల వెదుకనియమించితి.

శ్రీకృ—సేనానీ! మనమీవంకం బోదము. ఇవిగో గుఱ్ఱపుటడుగులు. వీనిజాడఁబట్టి పోదము.

సేనాని—అయ్యా! ఇదుగో గుఱ్ఱము చచ్చిపడియున్నది.

శ్రీకృ—సరే! ప్రసేనుని యడుగుల జాడంజూడుము.

సేనాని—అయ్యా! ఇవియే ప్రసేనుని యడుగులు. ఈదారిని నడిచినజాడ గన్పట్టెడు.

శ్రీకృ—సరే! నడువుము.

సేనాని—అయ్యా! ప్రసేనుఁడు చచ్చిపడియున్నాఁడు.

శ్రీకృ—అరే! మణిని వెదకుము.

సేనాని—స్వామీ! మణిలేదు.

శ్రీకృ—చూచి; ఇవిగో సింగపు టడుగులు. ఇతని సింగము చంపెను కాఁబోలు! సింహము నడుగులజాడంబట్టి నడువుము.

సేనాని—చూచి ప్రభో! సింగపుటడుగులు చాలదూరమువఱకు వ్యాపించినవి.

శ్రీకృ—అడుగులజాడ విడువకనడువుము. (అని నడచుచున్నారు.)

సేనాని—స్వామి! అల్లదో చూడుఁడు. సింగము చచ్చిపడియున్నది.

శ్రీకృ—మణిని వెదకుము.

సేనాని—అయ్యా! మణి కానఁబడలేదు.

శ్రీకృ—ఇంక నేమి యడుగులుండునో చూడుఁడు.

సేనాని—చూచుచు,

గీ॥ ఇదియునొకవింతగన్పడెనీశ్వరేశ । యెలుఁగుసింగముఁజంపుట లెన్నఁడెలుఁగ।
మృగములకురాజుసింగమైమెలఁగుచుండ । నెలుఁగుదానినిబడ నేయ నెట్లునేర్చె॥

శ్రీకృ—కృతయుగమునాటి భల్లూక మొక్కటి యీవనంబున నున్నయది యని వినికి గలదు అదియైయుండవచ్చును.

సేనాధిపతి—కృతయుగమునాటినుండి భల్లూకంబొక్కటీ యున్నదనివినుట మిక్కిలి యాశ్చర్యము.

శ్రీకృ—వినుము.

క॥ కృతయుగమునవామనునకు । గత్రేతనురాఘవునకుఁగదనసచివుఁడై।
మతిద్వాపరంబునెల్లను । గుహుకంబునవిశ్రమించుగుప్తతనుండై॥

అతఁడేయయి యుండవలెను. కానీ! చూతముపద.

సేనాధిపతి—స్వామీ! నాయందు దయచేత దేవరహస్యంబులం దెల్పితిరి. నేను కృతార్థుండనైతి.

శ్రీకృష్ణుఁడు—భల్లూకపుటడుగుల జాడంబట్టి పోవుదము. (అని మఱుఁగునకుఁ బోవుచున్నారు.)

[పిమ్మట చీఁకటితెఱలో నొకచిన్నదియు దానిదాదియు వ్రేలాడఁగట్టిన మణితోఁ బ్రవేశించుచున్నారు.]

దాది—బాలికా! బాలికా! యూరకుండుము (అని పాటపాడుచున్నది.)

మంజరి.

౧. ద్వారకాపురిలోన ధైర్యంబుమీర
౨. స్థైర్యంబుతోడ సత్రాజిత్తుఁడనెడు
౩. రాజుతమ్ముఁడు దావిరాజమానంబు
౪. మణిని గంఠంబున మక్కువతోడ
౫. ధరియించి వేఁటకుఁ దానేగుదేర
౬. సింగంబుచంపెఁ బ్రసేనునాతనిని
౭. నీతండ్రి దానిని నెఱిచంపివేగ
౮. మణిఁదెచ్చి నీకిచ్చె మంగళగాత్రి
౯. నీవల్లభునితోడ నిరతంబుఁజేరి
౧౦. జాంబవతీ కన్యసౌఖ్యంబుగనుము.

(ఇంతలోఁ బ్రక్కగా కృష్ణుఁడు ప్రవేశించుచున్నాఁడు)

శ్రీకృష్ణుఁడు—

క॥ సేనాధిపనీవిచ్చట । సేనలతోనిలుముబయటచెల్లినదినముల్।
నేనీగుహలోజొచ్చిబి । రానంగొనివత్తుమణినిరంజిల్లుమదిన్॥

అని కృష్ణుఁడు గుహలోఁ బ్రవేశించుచున్నాఁడు.

శ్రీకృష్ణుఁడు—(తనలో)

క॥ ఇదిగోమణియున్నదియి । య్యదియిటకుంజేరుటకునునపుడుకతమో।
య్యదియోయాయిబ్బాలికనే । సుదతిగనెనోదీనిమనికిచోద్యంబయ్యెన్॥

అనుచు దగ్గరకుఁబోగా బాలిక దాదిఁజుఁడచుచున్నది.

దాది—బిగ్గరగా! ఎవఁడవురా నీవు.

[జాంబవంతుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

జాంబవంతుఁడు—(బిగ్గరగా) ఎవఁడవురా! యోరి! నాప్రతాపంబెఱుంగక యేమనివచ్చి తివిరా! మనుజాధమా! నీబీరంబడంచెద నుండుము. (అని యుద్ధము నారంభించవలెను.)

(కృష్ణుని సేనాధిపతియును సేనలును బ్రవేశించియుండి.)

సేనాధిపతి—

సీ॥ సైనికులార వినుఁడింక శౌరిగుహాంతరగామియై యింకను గానఁబడఁడు।
పన్నెండుదినములబడి కాచియుంటిమి హరి యింక రాఁజాలఁడని తలంతు।
మనము నుబోఁ దలంచినను దద్గుహాగాఢతమము చేమించెదుర్గమము మనకు।
నేఁగియు నటమున మేమియు నొనరింపఁ జాలమంటయును నిశ్చయము మనకు।
తే-గీ॥ శౌరి దక్కఁగ కల్లగా! ద్వారవతికి । వైళమున బోయి జరిగినవార్త లెల్ల।
సీరికిని నుద్ధవునకును బౌరులకును । జెప్పటుచితము జాగింక సేయవలదు॥

సైనికులు—మీయిచ్ఛయించినటుల నే కానిండు,

(అని సైనికులు సేనానియు నిష్క్రమించుచున్నారు)

[పిమ్మట యుద్ధము చేయుచు జాంబవంతుండును కృష్ణుండును బ్రవేశించుచున్నారు.]

జాంబవంతుఁడు—మనుజాధమా! ఏమని నాగుహకుఁ గుహకవృత్తిఁ బచరింపవచ్చితివిరా! నీమదంబడంచి యీగుహకు బలియిచ్చెద చూడు.

కృష్ణుఁడు—ఏమి! భల్లూకమా! నీవా? నామదంబడంచు దానవు. నీకండక్రొవ్వు నేఁడ డంగించెద. సురంగక కురంగట నిలువుము దురంబున నినుహరింతు.

జాంబవంతుఁడు—నాముందఱ నీవన నెంతరా! నరాధమా! ఒక పిడికిటిపోటునకోర్వఁగల వా! నెత్తురు లురులమర్దించెద నిలువురా! నాముష్టిఘాతంబునకు రావణకుంభకర్ణేంద్ర జిత్ప్రహస్తాదులును సొమ్మసిల్లిరి. నీవా నాముందఱ నిలుతువు. ఇదె నాపాణిఘాతం బోర్చికొనుము. (అని కొట్టఁబోవుచున్నాఁడు.)

శ్రీకృష్ణుఁడు—భల్లూకమా! నీబెదరింపులు నన్నదలింపఁ జాలవు నాచేతి దెబ్బలకోర్చుట కలకనకగిరివా! యశనివా! బడబానలంబవా! నీవన నెంత! ఒక దెబ్బతో నొరగెదవు; బింకంబులేల! ఊరకుండుము.

జాంబవంతుఁడు—మనుజాధమా! బింకంబుల జంకించెదవు. చీమలం బీల్చునట్లు నీయసువులం బీల్చెద. చిక్కనై నిలువుము.

శ్రీకృష్ణుఁడు—మాటల నేమియగు! నిన్ను నిర్జించి నీమణిని గొనిపోక యూరక పొరుబాఁడను కాను. యుద్ధమునకుఁ గడంగుము. (అని యిద్దరు యుద్ధము చేయుచున్నారు.)

(జాంబవంతుఁడు క్రిందపడి యొగర్చుచు నిశ్చేష్టితుండుగ నుండఁగా కృష్ణుండూరక నిలుచుండెను.)

జాంబవంతుఁడు—(లేచి నమస్కరించి) నాస్వామి! నన్నురక్షింపుము.

దండకము.

శ్రీమజ్జగత్సృష్టి రక్షైకదక్షా, సుశిక్షా, నిజాంఘ్రిద్వయీదాసపక్షా, లసత్కౌస్తుభాంచత్సువక్షా, మహాదేవదేవేంద్ర ముఖ్యాదితేయ ద్విషద్రాడ్విపక్షా, నినుం జిష్ణునిం విష్ణుఁగా నెన్నఁగా లేక, నీతోడ వాదాడ పోరాడఁగా వచ్చితిన్, జొచ్చితిన్, నొచ్చితిన్, నన్ను నజ్ఞాన గాఢాంధముం బాపి వేగం గృపం జూడవే దేవదేవా! కృతాభిఖ్యకాలంబునం దేవమాతన్ గృతార్థం దగం జేయఁగా నెంచి యాసాధ్వి గర్భంబున న్గుజ్జురూపంబునం బుట్టి, వైరోచని న్మూఁడుపాదంబు లుర్విన్ దగన్వేఁడి భూదానమున్ బొంది వేవిశ్వరూపుండవై యెవ్వరుం దేటిచూడం గడుందుర్నిరీక్ష్యుండవై మూఁడులోకమ్ముల న్గ్రమ్మితౌ, త్రేతయందుం దశస్యందన క్షోణిపాలాత్మ జాతుండవై రామనామంబున న్వార్ధిబంధించి యారావణాది త్రిలోకారులౌ దుష్టసంఘంబుల న్బుత్రపౌత్ర ప్రపౌత్రాత్మమిత్ర ప్రవర్గంబుగా, ధాత్రి వేగూల్చి భూభారముం దీర్చి నన్నేలు నారాఘవేంద్రుండవౌ గాదె, యిక్ష్వాకులమ్మందస్మదాదుల్ తరింప న్భువి న్దేవకీ గర్భజాతుండవై దుష్టవారంబడంగించుచున్ శిష్టరక్షా వినోదుండవౌ కృష్ణదేవుండవీవే కలింగల్మషాక్రాంతులైనట్టి పాపాత్ముల న్నూపుమాపంగఁ గల్కి స్వరూపంబు దాల్పంగఁ గాంక్షించు కాలస్వరూపుండవీవేగదా! నిన్ను రుద్రేంద్ర పద్మోద్భవాదు ల్ప్రశంసింపలేరన్న, నేనన్న మూఢాత్ముడన్ గ్రోధుఁడ న్మత్తుఁడ న్బ్రాకృతుండ న్మహాదుష్టకర్మ ప్రబద్ధుండ నీచాత్ముడన్ నిన్ను వర్ణింపఁగా నెంతవాడన్ మహాత్మా జగన్నాథ నాపూర్వపుణ్యంబునం జేసి యవ్యాజకారుణ్యమొప్ప న్భవదీయాంఘ్రిదాసున్నను న్బ్రోవఁగా నిందు విచ్చేయుటం జేసి ధన్యుండనై లోకమాన్యుండనై పూర్ణపుణ్యుండనై తొంటి యజ్ఞానమున్ బాసి విజ్ఞానముం డాసితిన్, నన్ను రక్షింపు మోదీనరక్షామణీ కృష్ణగోవింద నందాత్మజా గోపికామానచోరా సుగోవర్ధనోద్ధార రక్షన్ సురవ్రాత శిక్షావిధ న్బృందలోనున్న నీరూపు నే డొప్ప సేవించి ధన్యుఁడనౌదు న్మురారీ ముకుందాచ్యుతానంత యక్రూరరక్షార్థమై యామునంబైన తీర్థంబున న్విశ్వరూపంబు గాన్పించు నీలీలలన్ నెమ్మదిం గొల్వఁగాంక్షితు నెల్లప్పుడో దేవమాంపాహి తుభ్యం నమః పాదయోర్మత్ప్రణామంబులందున్ దలంతున్ నుతింతున్ స్మరింతున్ మదాత్మన్ నమస్తే నమస్తే నమస్తే నమస్తే॥

శ్రీకృష్ణుఁడు—జాంబవంతా!

మ॥ వినునీశక్తియుభక్తి మెచ్చితిజనుల్వేనన్ను మున్నెన్న జే।
సిననిందన్బెడవాపనీనిలయమైచెన్నొందునిమ్మందిరం।
బునకున్వచ్చితినీమణిన్గొనిదురాత్ముల్ పిచ్చితింజెందఁజ।
య్యనినీఁబోయెదనిల్వుమింకిటనుధన్యత్వంబుసంధిల్లెడున్॥

జాంబవంతుఁడు—నాస్వామి! మణియనఁనెంత? నేనే నీయధీనుండనైతిని. మణులు మాఁ
బోట్ల కేమిటికి! మణియుం గన్యామణియును సమర్పించెద ననుగ్రహింపుము.

శ్రీకృష్ణుఁడు—జాంబవంతా! నీవ స్ఖలిత బ్రహ్మచారివి. నీకీకన్యక యెచ్చటిది!

జాంబవంతుఁడు—

సీ॥ ఋషితేజమునుదాల్చియొలమివిద్యాధరియగుచిత్రరేఖయిన్నగసమీప।
మునదీనిగాన్పఁగఁగనిదయాహీనయైదిగనాడిపోవనేదీనిగాంచి।
కనికరంబొదవిదాదినొకర్తుఁగూర్చిసంరక్షింపనట్టికారణమువలన।
జాంబవతియటంచుసంజ్ఞయుఁగల్గెజవ్వనముగల్గెడుదీనికిననురూప।
పతినిగూరుపఁబలుచోట్లవెదకుచుండ। భాగ్యములుపండినన్నేలుప్రభుఁడవీవె।
యిటకువిచ్చేయుటంజేసియేనుమిగుల। ధన్యతనుగంటిశ్రీకృష్ణదేవరాయ॥

శ్రీకృష్ణుఁడు—జాంబవంతా! నీవు పరభక్తియుక్తుండవు. నిన్ను భక్తుండని యెన్నక నొప్పిం
చితినని కృపగలిగెడును. ఐనను మున్నుఁగలకథ జ్ఞప్తియొనర్చెద వినుము.

సీ॥ మున్నయోధ్యాపురంబునరామలక్ష్మణాద్యాకృతిదాల్చినేనలవికుంఠ।
ధామంబునకునేగుతరినిన్నుఁబావనిమైందునిద్వివిదునిమఱియునంగ।
దునివిభీషణునిభూమినినిల్వడనినియమించినచోనన్నుఁగాంచియుద్ధ।
కాంక్షచేసితివిప్పుగాదుద్వాపరముననగుగాకయంటినయ్యదియునీవు।
ఎఱిఁగియుండిననాతోడనెదిరికొనఁగ। నియ్యకొనవనినినుమరపించిసమర।
మిచ్చినీకోర్కిచెల్లించితింకతొంటి। ముచ్చటలనీమనంబునదెచ్చుకొనుము॥

జాంబవంతుఁడు—ధన్యుండనైతి. కన్యామణిం బరిగ్రహించి మణిం గానుకగఁగొనుఁడు.
భక్తులకోరికి దీర్చుట మీపనిగద! ఆర్తశరణ్యుఁడవు గావున విన్నవించెద. అగ్ని
మణిని, కన్యను సమర్పింప నందఱు నిష్క్రమించిరి.

సప్తమాంకము.

---

శ్రీరస్తు.

# సత్యభామాపరిణయము.

## అష్టమాంకము.

---

[పిమ్మట ద్వారకాపురమున బలరామోద్ధవులు ప్రవేశించుచున్నారు.]

బలరాముఁడు—(విచారముతో) ఉద్ధవా!

శా॥ గోవిందుండు స్యమంతకంబు వెదకన్గో దండిమైయేగెదా।
నే వెంటంజనెనో యెఱుంగముగదా! యేవార్తలున్ రావు నే।
నావారంబును బోదు బాసటగఁ దన్నా సీరులున్ ద్రావునా।
కేవార్తల్ దెలియంగ రాదనికి నూహింపంగ లేనేమియున్॥

మ॥ పదునాల్గాయె దినంబులిప్పటికయో పద్మాక్షుఁ డేమాయెనో।
మొదలోనన్ దిగులుప్పతిల్లెడుగదున్ గృత్యంబు లెట్లయ్యెనో।
మదిలో వానిని జూడకున్న దినముల్ మాకుస్తమిస్రంబులౌ।
కదలన్గూడదు పోదునన్న రిపుధాకల్లల్లు నెట్లుద్ధవా॥

నే నేమి సేతునుద్ధవా! నాకేమియుఁ దోఁచడము లేదు.

క॥ వెన్నుని విడిచియు నిట్లుగ । నున్నది లే దెప్పుడేను నొంటరిగాఁగన్।
జిన్నతనంబుననుండియు । నెన్నఁడుగన్నులకు దోఁచుఁ గృష్ణుఁడు నాకున్॥

ఉద్ధవుఁడు—బలదేవా! నీవు ప్రాజ్ఞుండవైయుండియు నిట్లు విచారింతువా?

మ॥ బలదేవా! యిటులేల చింతిలెద హా ప్రాజ్ఞుండవైయుండియున్।
జలజాతేక్షణుఁ గూర్చి, యవ్విభుఁడనన్ సర్వంసహాచక్రమున్।
గల లోకంబులు గూడ బ్రహ్మభవదిక్పాలాదులన్ బట్టి చే।
తులనాడింపఁగలండు నాతని మొదన్ దుఃఖింపనీకేటికిన్॥

వ॥ ఎట్లైనను గృష్ణుఁడు తా దలఁచిన పని నెరవేర్పక మఱలఁడు.

బలరాముఁడు—అదుగో చూడుము. సేనాధిపతియు మఱికొందఱును నా చిన్నికృష్ణుని విడనాడి కేవలము వచ్చుచున్నారు.
(తత్తరముతో) నాతమ్ముఁ డేమయ్యెనో! ఏమివార్తవింటునో! ఏమిగానున్నదో!
(అని కూర్చుండఁబడుచున్నాఁడు)

ఉద్ధవుఁడు—(దిగులుబడి. వెచ్చనూర్పుచుండవలెను.)

[తర్వాత సేనాధిపతి ప్రవేశించుచున్నాఁడు.]

సేనాధిపతి— (గద్గదస్వరముతో) నమస్కారము బలభద్రప్రభో నామనవి నాలకింపుడు. మహాప్రభో శ్రీకృష్ణుఁ డరణ్యములో శైలగుహంజొచ్చి మమ్ముంబయట కాపుంచెను. పంద్రెండు దినంబులవరకు మేమందే లేచియుంచినను జాడలెవ్వియుఁ గానఁబడ వయ్యె. దిక్కులేనివారమై యిటకువచ్చినారము; ఏమిసెలవు!

బలరాముఁడు—ఏమిగతి! హా! తమ్ముఁడా! చిన్నికృష్ణా! (అనివిలపించుచున్నాఁడు)

ఉద్ధవుఁడు— తే-గీ॥ రామనీకేలయీావంతపామరుఁడవె?।
జగదుదయభావలయలీలుఁడగుమురారి।
గాఁడె? కృష్ణుఁడునీవునుగావె శేష।
ఫణిపతివిమీాకుధరనెందుమారుగలదె?॥

స్వామీా! మీకుదిగులేల? కొంచెము దినములలో శ్రీకృష్ణుఁడు జయలక్ష్మిం జేకొని రాఁగలఁడు వెఱువకుము.

మీాతండ్రిగారి సన్నిధికింబోదమురమ్ము (అని యిరువురు నిష్క్రమించుచున్నారు)

[పిమ్మట రుక్మిణిదేవి మంజువాణి సుభాషిణులు ప్రవేశించుచున్నారు.]

రుక్మిణిదేవి—(శోకముతో!) సఖి! మంజువాణి! ప్రాణనాథుఁడు నన్నువిడిచి ఘోరాటవున కేగెనుగదా! తద్వియోగభరంబున నే నిలువజాలకున్నాను (మఱియుఁ శోకముతో)

సీ॥ ఏమాయమర్మమొక్కొంతయొఱుంగని వెన్నునిపైనిందవేసిరేల?
వేసెంబోనాదుష్టవిసరోక్తిబాటించివిభుఁడు కానలకుదావెడలనేల?
వెడలెంబోప్రాణేశుఁడుడుగనికూర్మి వెంబడిగొంచుపోకనన్విడువనేల?
విడిచెంబోనాథునివెంట నేనఱుగక నొంటిమైయింట నేయుంటినేల?
తే-గీ॥ కటకటావిధినాయెడఁగరుణదప్పి । నామనోహరునెడబాపెనేమిసేతు।
నీమహాదుఃఖవార్నిధినెట్లుగడుతు । నయ్యయో! చెలియికయెట్టులమ్మసేతు॥

మంజువాణి—అమ్మా! ఊరడిల్లుము.

క॥ అమ్మా! జగములమాతవు । ఇమ్మెయిదుఃఖింపనేలయిందిరవుగదే।
ఇమ్మాడ్కినిన్నువిడువఁగ । నమ్మాధవుఁడెప్పుడైన నాత్మదలఁచునే॥

సుభాషిణి— శా॥ చింతంజెందకుమమ్మనాథునెడసా శ్రీశుండనీకాంతుఁడ।
త్యంతప్రేమనుదారలైపొడమిశీవజ్జాలయాదేవివీ।

పంతంబూందఁగ నేలనీచరిపులన్వారింపఁగా నేఁగెదా।
నింతన్వచ్చుచునుండునూఱడుము నీకీవింతలేలే చెలీ॥

[వార్తాహారిణిప్రవేశించుచున్నది.]

వార్తాహారిణి—జయజయమహాలక్ష్మి! రుక్మిణీమహాదేవి జయజయ.

రుక్మిణి—వార్తాహారిణి! ఏమివార్తలు?

వార్తాహారిణి—అమ్మా! మణికై యటవికేగిన మాస్వామివారి కనుచరులగు సైనికులును సేనానియు నిటవచ్చిరి.

రుక్మిణి—హా! ఆర్యపుత్ర! మీరుమాత్రమేమయుంటిరా? అక్కటా! నే నెట్టులోర్తు! తర్వాతిసంగతి చెప్పవే! ఏలదాచెదవు?

వార్తాహారిణి—బలరామోద్ధవులుండఁగా సేనానివచ్చి, "అడవిలో నొకగుహంజొచ్చి శ్రీకృష్ణుఁడు పండ్రెండుదినంబులవరకు రాకున్న విసికి యేవార్తయుం దెలియక దిగులంది వచ్చినామని చెప్పెను.

రుక్మిణి—తర్వాత ఏమైనది?

వార్తాహారిణి—బలరాములు శోకింపగా నుద్ధవుండు ధైర్యంబుచెప్పి యోదార్చెను.

రుక్మిణి—హా! ఆర్యపుత్ర! ఏమైతిరి! నన్నిందేల యుంచితిరి?

(అని మూర్ఛిల్లుచున్నది)

మంజువాణి—తల్లీ! ఊరడిల్లుడు. (అని వీచుచున్నది.)

రుక్మిణి—(లేచి) ప్రియసఖీ! వన్నేల విడువవు? నేనును నరణ్యంబునకుంబోయి యార్యపుత్రుంగలసికొనియెద, (అని లేచుచుండగా మంజువాణి పట్టుకొనుచున్నది.)

సుభాషిణి— తే-గీ॥ తల్లి చింతింపలేలనీయుల్లమలర।
విజయలక్ష్మియుతుండయివిభుఁడు వేడ్క।
వచ్చునేఁడెల్లి యింతలోవగలమిగుల।
నొగలదగునమ్మమీబోటిమగువలకును॥

మీకంతకుందోఁపకుండెనేని కాత్యాయనీదేవింగొల్చి జాతరసేయఁగా నామె ప్రసన్నురాలయి విభునితాక దెలుపఁగలదు.

వార్తాహారిణి—మహారాణి! దేవకీదేవి వారికడకుంబోవలయు సెలవొసంగుడు." (అని నిష్క్రమించుచున్నది.)

మంజువాణి—మహారాణి! సుభాషిణితలంచిన తెల్వింగొప్పిదయున్నది. అట్లు చేయచిత్తంబు నందలంపుము.

ఈవిఘంబు దేవకీ రేవతీ మహాదేవేరులకు న్విన్నవించి వారెద్దియాజ్ఞయిచ్చిన నటులగా వింతము. (అని మువ్వురు నిష్క్రమించిరి.)

[మిశ్రవిష్కంభము.]

[పిమ్మట వసుదేవబలరామోద్ధవులు ప్రవేశించుచున్నారు.]

వసుదేవుఁడు—(శోకముతో)

ఉ॥ ఓయదువంశభూషణజయోన్నతనిన్నొకఁడేనుబంచెదన్।
నీయనుజన్ముఁడొంటరిగనేడువనంబుననున్నవాఁడునీ।
వీయెడదోడుగాజనుముకృష్ణుఁడుశత్రులతోడబోరెడిన్।
వేయటకేగియాతనికివృద్ధియొనర్పుముశౌర్యసంపదల్॥

కావున బలరామా! నీవు తమ్మునికిం బాసటగజని వానికి జయంబులొసంగి వేగంబ తోడ్కొనిరమ్ము.

బలరాముఁడు—మ॥ జనకా! కృష్ణుఁడులోకకర్తయగునిస్సందేహమీమాటయా।
తనికిన్బాసటయొక్కఁడేలవినుసత్వంబొప్పనన్నంబురం।
బునకున్నిల్పినవాఁడునేనునటకుంబోవైరులిప్పట్టునన్
ఘనులైముట్టడివేయవారినుడుపంగాశక్తులెవ్వారిటన్॥

జనకా! ఇంకను గొన్ని దినంబులూరడుడు; మనకు మేలువార్తరాఁగలదు. అయినను మీరుగట్టిగ వెళ్లుమంటిరా! వెళ్లెదను.

ఉద్ధవుఁడు—మ॥ వసుదేవావినుమొక్కమాటధరణీభారంబువాపంగఁగో।
రిసురానీకముబ్రహ్మఁగూడిచనివార్ధింజేరిశేషాహిశ।
య్యసుఖంబుండినశౌరిఁగాంచివినుతుల్హర్షంబుతోజేయఁదా।
నసురానీకముద్రుంతునంచుదయమయ్యెన్నీకుబుత్రాకృతిన్॥

క॥ అతఁడుచతుర్దశభువనము । లతులకృపన్సృష్టిసేయనవియడఁగింపన్।
వితతంబుగరక్షింపను । నతినేర్పరివానికెట్టు! లపజయములగున్॥

అగ్రజా వెఱువవలదు. బలరాముండిటలేకుండుతఱి వేచి జరాసంధాదులేమిచేయుదురో! ఆతని నిందేయుండనిండు; జనులందఱుఁజేరి చండికాదేవింగొల్చిన నామె ప్రసన్నురాలై కృష్ణుని రాకడ దెలుపగలదు.

వసుదేవుఁడు—ఉద్ధవా నీచెప్పినచందం బొప్పియున్నది.

బలరామా! నీవు వీట నేయుండుము. ప్రజలనెల్ల జాతరసేయ నాజ్ఞాపింపుము.

బలరాముఁడు -తండ్రిగారాజ్ఞాపించినట్లె (చేసెదను)

ఎవఁడురా? ద్వారమున?

[భటుఁడు ప్రవేశించి]

భటుఁడు—అయ్యా! ఆజ్ఞానుగ్రహంబు వేచియున్నవాఁడ.

బలరాముఁడు—నీవుపోయి సేనాధిపతితో (కృష్ణదర్శనార్థము) జండికకు జాతరలుసేయ వలయునుకాన సంభారంబులంగూర్చియిచ్చి పౌరులెల్ల జాతరలుసేయ నాజ్ఞాపింపుమని చెప్పుము.

భటుఁడు—మహాప్రసాదము (అని నిష్క్రమించుచున్నాఁడు)

[అందఱుగూర్చుండఁగా సేనాధిపతిప్రవేశించుచున్నాఁడు.]

సేనాధిపతి—మహారాజాధిరాజ! నమస్కారము.

బలరాముఁడు—సేనాధిపా! విష్వక్సేనా యేమివార్తలు.

సేనాధిపతి—స్వామీ! తమయాజ్ఞాప్రకారము పురంబునను నంతిపురంబునను జాతరలు సేయుసన్నాహ మొనర్చితి. జాతరలైనవి. అమ్మవారు ప్రసన్నులై సెలవిచ్చినారు.

బలరాముఁడు—(తొట్రుపాటుతో) ఏమని?

సేనాధిపతి—

క॥ ఏలావగచెదరందఱు। జాలింబడి, చక్రధరుఁడుశత్రువిజయుఁడై।
లీలాగతిసన్మణితో। బాలామణితోడ రేపువచ్చుముదముతోన్॥ అని.

బలరాముఁడు—(మహానందముతో) ఉద్ధవా!

ఆ.వె॥ నీదువాక్యమెల్ల నిక్కమయ్యెను నేడు। పలికె మేలువార్త ప్రౌఢితోడ।
మణినియువతిమణినిమాధవుఁడీవేళ। గొంచువచ్చుననుచుగోరిగారి॥

చండికాదేవి మృషలాడదు కావున వాసుదేవాగమన సంతోషముతోడ బాలికా వివాహశుభసంతోషంబు ననుభవింతుము రేపటికి బురంబెల్ల నలంకరింప సర్వసన్నాహములకు విష్వక్సేను నంపుము.

ఉద్ధవుఁడు—సేనాధిపా! బలరాముని యాజ్ఞలన్వింటివా! సర్వసన్నాహములకుం జనుము.

సేనాధిపతి—మహానుగ్రహము. (అని నిష్క్రమింపవలయును.)

బలరాముఁడు—ఉద్ధవా! బాలామణితో వచ్చునని చండిక చెప్పినవార్త నాలోచింతము. బాలిక ఎవతె? అటవిలోనికెట్లు వచ్చినది? దానిని వివాహము చేసికొన నిచ్ఛగించునా? కృష్ణుఁడు?

ఉద్ధవుఁడు—బలరామా! ఇంతమాత్రమె కాదు. వసుదేవా! అగ్రజా! వినుఁడు! మనకృ

ష్ణునకు భార్యలెనమండ్రుడు కాగలరు. ఇంకను బదియారువేలరాజకన్యకలిల్లాండ్రుడు కాఁగలరు. ఇదియంతయు మనకద్భుతముగ దోఁచును.

బలరాముఁడు—అదియంతయు నాతనిమాయయే గాని వేఱుకాదు. మాయచే జగంబులకు స్థితిలయంబు లొనర్పంజాలిన వానికిది దొడ్డకృత్యమా?

నేపథ్యంబునశంఖధ్వని.

ఉద్ధవుఁడు—ఓహో! కృష్ణుని విజయపాంచజన్యధ్వని వినఁబడుచున్నది. శ్రీకృష్ణుఁడు వచ్చుచున్నవాఁడు; మనమాతని నెదుర్కొనుదము.

[సేనాధిపతి ప్రవేశించుచున్నవాఁడు.]

సేనాధిపతి—తాలాంకమహారాజ! గరుడధ్వజుండు విచ్చేయుచున్నవాఁడు.

వసుదేవుఁడు
ఉద్ధవుఁడు
బలరాముఁడు } —హర్షము నభినయించుచు నందఱు నిలుచుండఁగా

[కృష్ణుఁడును జాంబవతియు మణితోఁబ్రవేశించుచున్నారు.]

శ్రీకృష్ణుఁడు—జనకా తమ సుతుండు గోవిందుండు వందనంబిడుచున్నాఁడు.

(అని వందనము చేయవలయును)

వసుదేవుఁడు—వత్సా! చిరాయుర్భవ.

శ్రీకృష్ణుఁడు—ఉద్ధవా! పితృవ్యా! నావందనంబభినందింపుఁడు.

ఉద్ధవుఁడు—శత్రుజయోస్తు.

శ్రీకృష్ణుఁడు—అగ్రజా! బలరామ! యనుజన్ముని నమస్కారం బంగీకరింపుడు.

బలరాముఁడు—అనుజా! నీవింతకాలంబు దడయుటకు దురటిల్లితిమి. నీవచ్చుటంజేసి సకల సౌభాగ్యంబు లొడగూడినవి. మనజననీజనకులు నిన్నుఁగూర్చి చింతిల్లుచు మన యుద్ధవునివాక్యంబుల నూరడిల్లిరి. నీరాకకు తండ్రిగారిచ్చటనే వేఁచియున్నవారు.

శ్రీకృష్ణుఁడు—పెద్దలయాశీర్వచనంబు బలిమికలిమిని శత్రుజయమొంది వచ్చినాఁడ. జాంబవతీ! పెద్దలకు వందనంబొనర్పుము.

జాంబవతి—ఆర్యపుత్ర! మీయాజ్ఞనువహించెద. (అని వందనముచేయుచున్నది)

శ్రీకృష్ణుఁడు—ఉద్ధవా! ఇక్కన్నియం జేకొని మాతృసన్నిధానంబు ననునిచిరమ్ము.

[ఉద్ధవుఁడు కన్యతో నిష్క్రమించుచున్నాఁడు]

బలరాముఁడు—చిన్నికృష్ణా! ఇక్కన్నియయెవతె? మణియే జాడగఁజిక్కినది! మణియేది!

శ్రీకృష్ణుఁడు—మీయొద్ద నాజ్ఞంగొని చని మణికై వెదకుచుఁ బోవఁగాఁ గాననంబునఁ జచ్చియున్న ప్రసేనునిహయంబును బ్రసేనుని జక్కాడచిన సింగంబును జూచితిమి.

బలరాముఁడు—పిమ్మట ? పిమ్మట ?

శ్రీకృష్ణుఁడు—ఆసింగమును జంపిపోయిన భల్లూకంబు నడుగుజాడలుచూచి యా వెంబడిఁ జనఁజన నరణ్యంబున నొకశైలంబును దాని గుహయును గానఁబడియె.

బలరాముఁడు—ఊఁ! ఆశ్చర్యము ; పిమ్మట ?

శ్రీకృష్ణుఁడు—ఆగుహలోనికిం జననిక్కన్యకయు దీనికిం దర్పణంబుగగట్టిన మణియుఁ గానఁబడిన మెల్లన మణింగ్రహించితి.

బలరాముఁడు—పిమ్మట ? పిమ్మట ?

శ్రీకృష్ణుఁడు—పిమ్మట జాంబవంతుఁడని ప్రసిద్ధిఁజెందిన భల్లూకరాజొకఁడు నన్నెదిరింప వానితో నిరువదియొక్కదినంబులు బోరాడితి.

బలరాముఁడు—త్రేతాయుగమున రఘురామునకు బాసటయైనవాఁడా ? మహాశ్చర్యము అతం డెట్లింతవరకున్నాఁడు ?

బలరాముఁడు—ఊఁ! పిమ్మట ?

శ్రీకృష్ణుఁడు—అతండు నాపోటునకుడస్సి ప్రపన్నుండైన నాతనిగరుణించి యీమణిని గన్యామణినిఁ గానుకగఁగొని దోడ్కొనివచ్చితి. ఇదియంతయు మనతల్లిగారికిని మిగిలిన పెద్దలకుం దెలుప నంతఃపురంబునకుం బోవుదమురండు

[అనగ నందఋనిష్క్రమించిరి.]

ఇది యష్టమాంకము.

---

## నవమాంకము.

[వసుదేవుఁడును గర్గమహర్షియు బ్రవేశించుచున్నారు]

వసుదేవుఁడు—గర్గమహర్షివారు ! మీరే మాకెల్లశుభంబుల కాలవాలమైనవారు. శ్రీకృష్ణుఁడు స్యమంతక మణ్యన్వేషణంబునకైపోయి జాంబవంతునితో సమరంబొనర్చి గెల్చి తత్సుత, జాంబవతియను కన్యకం గానుకగఁగొని మణిసహితంబుగ వచ్చినవాఁడు.

గర్గమహర్షి—వసుదేవా ! నీభాగ్యంబేమనికొనియాడుదు. సనకసనందనాది పరమయోగులకైన వాఙ్మనసంబుల కందని పరతత్త్వంబు నీకున్పుత్రభావంబున గన్పడుచున్నాఁడు. నీ తపంబక్షయంబు.

వసుదేవుఁడు—మీబోఁటి పెద్దల యాశీర్వచనంబులే మాకుఁ దపఃఫలంబులు.

గర్గమహర్షి—వసుదేవా! నన్నుంబిలిపించిన కారణంబేమి?

వసుదేవుఁడు—మహర్షివరా! శ్రీకృష్ణుని వివాహంబొనర్పవలయును. అట్టి శుభంబున కనుకూలంబగు ముహూర్తంబు నిశ్చయింపుము. మీరేగద మాకెల్ల శుభంబులకాస్పదులు.

గర్గుఁడు—వసుదేవా! నీ సంకల్పంబున కనుగుణంబగు ముహూర్తంబు రేపటిదినంబె యయియున్నది. ఇట్టి ముహూర్తంబెఱింగియే నీసుతుండు గన్నియనిచ్చోటికి నేఁడే తీసికొనివచ్చినాడు. ఆతండు సర్వజ్ఞుండు.

వసుదేవుఁడు—ఇంత శీఘ్రంబున శుభంబులౌదవుటకు మిక్కిలి సంతసించుచున్నవాఁడ.

గర్గుఁడు—ఇంతియకాదు. ఱేపటిముహూర్తమున శ్రీకృష్ణుండిరువురు కన్యకల వివాహము చేసికొనునంత బలముగల ముహూర్తమైయున్నయది.

వసుదేవుఁడు—మీ యనుగ్రహముగలుగ శుభంబులకేమికొదువ!

గర్గుఁడు—(కొంచెముధ్యానించి) వాసుదేవుండు ఱేపటిదినంబున నిక్కముగనె చక్కని కన్యకల నిరువురవరించును.

వసుదేవుఁడు—ఒక్కకన్నియయె యిపుడు వచ్చియున్నది. ఇంకొక్కకన్యక యెచ్చటిది!

గర్గుఁడు—ఇప్పట్టణంబున నున్నయది.

వసుదేవుఁడు—అది యెట్లు! ఎవ్వారలు నివ్వార్తయెన్నఁడునన్నదిలేదే!

గర్గుఁడు—అఘటితఘటనాసమర్థుండగు నీ కొమరునకును వింతలా! అన్నియుఁ గ్రమంబున ననుకూలంబులగును చూడుఁడు.

వసుదేవుఁడు—మీ తలంపులే మాకు శుభాలవాలంబులు మీరును సర్వసన్నాహంబులతో మునిగణంబులతోఁడ రేపటియుదయమునకే రావలయుజుండీ.

గర్గుఁడు—నీ చెప్పినట్ల కావించెద, నీవును నంతఃపురంబునకుంజని తగుపరివారముతోఁ గూడి శుభార్థమై యాలోచింపుము.

[అని యిరువురు నిష్క్రమించిరి.]

(విష్కంభము:)

[పిమ్మట శ్రీకృష్ణ బలరామోద్ధవులు సేనానియుఁ బ్రవేశించుచున్నారు.]

శ్రీకృష్ణుఁడు—అగ్రజా! బలభద్రా! సత్రాజిత్తు తనమణిని నేనపహరించితినని పట్టి నిందలుచేసెఁగా! ఆతనింబిలుపించి మణివృత్తాంతం బెఱింగించి యతనికి నిమ్మణినిచ్చి వేయవలయునుగదా.

బలరాముఁడు—జాగేల! వేగంబిపిలుపించి మణినిచ్చి నిందబాపికొందము.

శ్రీకృష్ణుఁడు—ఉద్ధవా! నీతలంపేమి?

ఉద్ధవుఁడు—నీతలంపెల్ల బాగుగనున్నది.

శ్రీకృష్ణుఁడు—(సేనాధిపతికై చూచి) విష్వక్సేనా! సత్రాజిత్తుల బిలువుము.

సేనాధిపతి—మహాభాగ్యము. (అని నిష్క్రమించి.)

[సత్రాజిత్తుతో ప్రవేశించుచున్నాఁడు.]

సత్రాజిత్తు—ఉద్ధవా నమస్కారము.

శ్రీకృష్ణుఁడు—సత్రాజిత్తుగారు! కూర్చుండుఁడు. (కూర్చుంటున్నాఁడు.)

మీమణిని నేనపహరించి మీతమ్మునిఁ జంపితినని నాపై వట్టినిందలవైచితిరి. నే నే సంగతియు నెఱుంగకున్నను నిందంబాపికొనఁబ్రయత్నింపవలయును గావున నరణ్యాంబున మీతమ్ముఁడు వేటలాడియున్న ప్రదేశంబుగని యెట్టకేని మణింగన్పట్టి మీకియ్యాం దోడ్కొనివచ్చితిని. ఇదిగోమణి.

(అని చూపవలయును) దీనిం బరిగ్రహించుకొని సుఖంబున నుండుఁడు. (అనియియ్యఁ బోవుచున్నాఁడు.)

సత్రాజిత్తు—(ఏమియు ననలేక లజ్జతో) చిత్తము. దయచేయుఁడు (అని యిచ్చినదానిని తీసుకొని నిష్క్రమించుచున్నాఁడు.)

ఉద్ధవుఁడు—బలరామా! మనకృష్ణునకుఁ బరిణయంబొనర్ప మంచిముహూర్తమాలోచన సేయుటకు మీతాతపాదులగు వసుదేవులకును దేవకీమహాదేవికిని విన్నవించి గర్గమహర్షివలన ముహూర్తనిశ్చయంబు సేయింప విన్నవించివత్తము రమ్ము.

బలరాముఁడు—పితృవ్యులుపదేశించిన యట్లె (అంగీకారము.)

ఉద్ధవుఁడు—శ్రీకృష్ణా! పయనంబుల బడలియున్నవాఁడవు నీలాపనిందయను నాపదని స్తరించితివి. సత్రాజిత్తుండును దనమణిజెందిన సంతోషలాభంబులనొందినవాఁడు. కొంతవడి విశ్రమింప నంతఃపురంబున కరుగుము. (అనఁగాఁ గృష్ణుఁడు నిష్క్రమించెను.)

బలరాముఁడు—పితృవ్యా! మనమిరువురము తండ్రిగారిసన్నిధికింబోదమా!

ఉద్ధవుఁడు—అవశ్యము. (అనఁగా నిరువురునిష్క్రమించిరి.) పిమ్మట సత్రాజిత్తుగృహంబున [సత్రాజిత్తు-సుదేవియు-సత్యభామయు ప్రవేశించుచున్నారు.]

సత్రాజిత్తు—పంచచామరములు.

౧. పరాత్పరుండుకృష్ణుఁడంచుఁబల్కలేక పాపినై
హరించెరత్నమంచునిందలామహాత్ముఁజెందఁగా
జరించిదుష్టబుద్ధినైతిశాంతియెట్లుగల్గునో!
హరింభజింపకున్న నాకునంచుశోకమందెదన్.

౨. దురాత్ముఁడైననుందలంపదోషపుంజమంతయున్
హరించువాసుదేవుపైనఘాళిగల్గెనంచు నే
దురూహతోడనిందసల్పిదుష్టబుద్ధినైతి నా
హరిన్దయాళుఁగానొనర్పనైనయత్నమెట్టిదో?

దేవీదుష్టబుద్ధినై శిష్టపాలకుండగు వృష్ణివరుమీఁద నపనిందలబన్నితి. పాపాత్ములైనను దన్నొక మరిస్మరించిన బుణ్యపురుషులం జేయుచున్న జనార్దనునకే, పాపముగలదన్న నా పాపమునకు మేరగలదా? యిప్పాపంబుబాపికొన నేమియుపాయము కలదు? నీపరికించినదిగలదేని నుడువుము. దేవీ?

సుదేవి—ప్రాణనాయకా! మీకాలోచనచెప్ప నే నెంతటిదానను ఐనను. నాయందు మన్నించి నన్నేయడిగితిరిగాన నాకుందోఁచిన విధంబువిన్నవించెద. ప్రాణనాయకా! ఆవనమాలి భక్తజనపరిపాలి. ఆతనికి భక్తిచేసినవారియెడ మిక్కుటంబగుప్రేమ! ఆరుక్మిణీపతికి మన ధనకనకవస్తువాహన తపస్సత్య ధర్మయోగంబులు రత్నంబులు నలంతులుఁ. వీనిచే నామహాత్ము లోఁబరచుకొనఁజాలము. "మిత్రభావేనసంప్రాప్తం నత్యజేయం కథంచన" అనియు, "అభయంసర్వభూతేభ్యో దదామ్యేతద్వ్రతం మమ" అనియు దీక్షవహించినవాఁడు. కావున నాతని శరణంబుపొందినం జాలును.

సత్రాజిత్తు—మనమేమి యాలోచనబట్టి యామహాత్ముని యనుగ్రహపాత్రులమగుదుము?.

సుదేవి—సీ॥ శ్రీకృష్ణదేవుండు శేషాహితల్పుండువందారుమందారుఁడిందిరేశుఁ।
డత్యంతశూరుండుహరిహయప్రముఖసురాళిపాలకుఁడులోకాదికర్త।
కాంతామనోహారికందర్పకందర్పుఁడమలయశుండుసత్యాలవాలుఁ।
డాశ్రితకిల్బిషహరుఁడుజగత్సృష్టిరక్షాలయేశ్వరకుక్షియుతుఁడు।
కానమనకన్య, కానుకఁగాఁగనిచ్చి । బాచికొనవచ్చుకిల్బిషవ్రాతమెల్ల
నాకుదోఁచినవిధమిదినాథవినుము । మిగులుపనులకుఁగర్తలుమీరెయిఁక॥

ఇదియునుంగాక కృష్ణుండు బహుభార్యావల్లభుండుకాఁగలఁడని వినియుంటి. ఇట్టి జగన్మనోహరుగోష్ఠి యనుభవింపఁ బెఱనాతులోర్తురే! పట్టమహిషులెనమండ్రును

భోగినులు షోడశసహస్రకన్యకలును శ్రీకృష్ణునకు వల్లభలయ్యెదరని మున్నొక ఋషి వాక్రుచ్చె; మనకన్నియలావణ్యంబునకా సొబగుండు వరుండు గాకుండిన నెలఁత జవ్వనంబవ్వనం బేయగును. ఆమహనీయుండు మనకల్లుండయ్యెనేని మనకంతకంటెను భాగ్యంబుగలదే? కావున నానందనందనుపాదారవిందంబులకు శరణంబునొందజనుడు ప్రాణవల్లభా!

సత్రాజిత్తు—ప్రియసఖి! నీవాక్యంబులత్యంతాదరణీయంబులు. రుక్మిణీపతిం జేరి శరణంబందెదను. మనకీస్యమంతకరత్నంబేల? నీరత్నంబును గన్యారత్నంబును గానుకగా, గొనిపోయెదను. ఆమహాత్ముండు దైవతుల్యుండు కావున. రత్నానిధనధాన్యాని యన్నట్టులుగా సర్వమునువదలి శరణుపొందవలెనని న్యాయంబుకలిమిం జేసి మనకుఁగల సర్వధనంబగు రత్నకన్యారత్నముల నాతనికి సమర్పించి శరణాగతుఁడనయ్యెద. ఇదియే, నిశ్చయంబు. సత్యభామా! నాముద్దులపట్టీ! నీకు ముకుందుండు వల్లభుఁడగుట యభీష్టమేకద?

సత్యభామ— తండ్రీ! ముకుందగుణానుభవజనితానవధికాతిశయ సంతోషంబునంజేసి లజ్జాక్రాంతురాలనయ్యు నిప్పటిపరమానందంబున బ్రీడందిగనాడి ప్రోడగతి మీతోడ విన్నవించెద: నేను బూర్వజన్మంబున నెన్నినోములునోచి యెంతతపంబొనర్చితినో! యీజన్మంబున శ్రీకృష్ణభగవంతుఁడు నాకు విభుఁడగునట్లు లభించితిని. నాప్రార్థనల నపేక్షింపక తమరే యీయాలోచన సేయుచున్నారు. మీరితరులకు నన్నీనిచ్చగించినను నే వారలనవ్వరించుదానగాను జుఁడీ! దాఁచక చెప్పినదాన.

సుదేవి—వింటిరా! మనకన్నియకోర్కెలు? ఇదియు నేజన్మంబుననో మిక్కిలి తపంబొనర్చినది. కావుననే నీజన్మంబున గోవిందునకు వనితయయ్యెడు నదృష్టంబులభించినది. ఇదియే మహాభాగ్యము.

సత్యభామ—జనకా! వినుఁడు; నారాయణపరుండితరదేవతలనెట్లారాధింపకుండునో యట్లె శ్రీకృష్ణగతమనోభావనైన నేమను నన్యరాజన్యుల వరించుదానకాను. నన్ను శ్రీకృష్ణునకే యిచ్చి ధన్యత్వమునొందుఁడు.

సత్రాజిత్తు—దేవి! నీవు దేవకీదేవికడకుం జని మన సమాచారముల నామెకుఁ బ్రార్థనగా జెప్పుము. నేనును గన్యందోడ్కొని వల్లవీపల్లవునికడకుం బోయెద (అని మువ్వురు నిష్క్రమించిరి.)

[శ్రీకృష్ణ బలరాములును ఉద్ధవుండునుగల కచేహరీలోకి కన్యందోడ్కొని సత్రాజిత్తు ప్రవేశించుచున్నాఁడు.]

సత్రాజిత్తు—క॥ స్వామీ! యాదవనందన। నామనవినివినిమదీయనవ్యమణినిగ।
న్యామణిని గాన్కగాఁగొని। నామీదదయావలోకనములబరపుమీ॥

ఆ, వె॥ ఈస్యమంతకంబు నేముధరింపంగ । జాలమయ్య దేవశార్ఙ్గపాణి।
మీకుదగుధరింపమిక్కుటంబుగదీని । స్వీకరింపుమయ్య శేషశయన॥

శ్రీకృష్ణుఁడు—సత్రాజిన్నృపాలా! మీకన్నియ మాకిచ్చినంజాలును; స్యమంతకరత్నంబు మీయొద్దనే యుండనిండు. అన్యులక్రియ మీకీమాటలేల? నాయందు మీకుం బ్రేమ కలుగుటచే మాకత్యంతంబు నానందంబయ్యెడును.

సత్రాజిత్తు—ధన్యుండనైతిని; నాకన్నియం బరిగ్రహించితిరి; నాకు ననుజ్ఞయిండు;

శ్రీకృష్ణుఁడు—మీరన్యులక్రియ మాటలాడెదరేల? వసుదేవుని సన్నిధికిం జని యుండుఁడుఁడు. (అనగా సత్రాజిత్తు నిష్క్రమించుచున్నాఁడు.)

ఉద్ధవా! యీకన్నియ నస్మాత్గృహంబున నుంచుము.

ఉద్ధవుఁడు—నీయానతి యట్లెకావించెద (అని కన్నియతో నిష్క్రమించును.)

బలరాముఁడు—శ్రీకృష్ణా! మనము నిందుండ నేమిటికి? తండ్రిగారి సన్నిధికిం బోదము (అనఁగా నపహరించి తండ్రియగు వసుదేవుని సన్నిధికిం బోవుచున్నారు.)

[పిమ్మట గర్గవసుదేవులు బలరామోద్ధవాక్రూరులును గూర్చునియుండ సత్రాజిత్తు ప్రవేశించుచున్నాఁడు.]

సత్రాజిత్తు—వసుదేవమహారాజ! నాపుత్రికం గోడలిగఁ గైకొమ్ము.

వసుదేవుఁడు—(సంతోషమభినయించుచు) తోడతోడనె కళ్యాణాభివృద్ధియయినది. మహాసంతోషము. గర్గసంయమీ! మీయమోఘవాక్యముల ఫలమిది. బలరామా! నీయనుజుని కళ్యాణంబులకు సంభారంబులుగూర్ప విష్వక్సేనునిం బనుపుము.

బలరాముఁడు--(లేచివచ్చి) ఎవఁడురా ద్వారమున?

[భటుఁడు ప్రవేశించి]

భటుఁడు—స్వామి! కింకరుఁ డున్నవాఁడు.

బలరాముఁడు—శ్రీకృష్ణకళ్యాణంబునకు సర్వసంభారములు సమకూర్ప సేనానికిం జెప్పుము.

భటుఁడు—చిత్తము. మహానుగ్రహము. (అని భటుఁడు నిష్క్రమించుచున్నాఁడు.)

[పిమ్మట సేనాధిపతియగు విష్వక్సేనుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

విష్వక్సేనుఁడు—బలరామా! నాస్వామి! కళ్యాణార్థపదార్థంబులన్నియు నొడగూర్చినాఁడ.

బలరాముఁడు—మంచిది విష్వక్సేనా! నీవుపోయి కళ్యాణవేదికల నలంకరించి మేము వచ్చువరకు వేచియుండుము.

విష్వక్సేనుఁడు—మహానుగ్రహము. (అని వెళ్లుచున్నాఁడు.)

రాముఁడు—జనకా! వసుదేవా! సర్వము సిద్ధమైన యది ఇఁకను వివాహవేదికంజేర నవధరింపుఁడు.

వసుదేవుఁడు—గర్గమహర్షీ! యేమియాజ్ఞ? వేదికకడకుం బోదమా?

గర్గుఁడు—శుభం! శుభం! తథాస్తు (అని యందఱు లేచి తెఱలోనికిం బోవలెను.( (తెఱయెత్తగా!)

[వివాహవేదిక సీను]

శ్రీకృష్ణుఁడు జాంబవతి కుడివైపునను సత్యభామయెడమపంకను కూర్చొనియుండునట్లు పెండ్లిపీఠముమీదను. గర్గుండు చెంతను దేవకీవసుదేవులు రేవతీబలరాములు. ఉద్ధవాక్రూరులును గూర్చుండగా.

గర్గుఁడు—సర్వమంగళానిభవంతు (అని అక్షతలు చల్లవలెను.) అందఱు సంతసింపవలెను. జగన్నాథ! కృష్ణా! నీకు నేనేమని శుభంబులాపాదింతును. అయినను భరతవాక్యముగ నొక్కటిప్రార్థించెద.

తో॥వదవృత్తము॥ సర్వజనంబులుసౌఖ్యమునొందన్
యుర్వరయెల్లనుయోజఫలించున్
ఉర్విపులెల్లనుయోగ్యులుకాగా
సర్వజగత్పతిసౌమ్యతఁబ్రోచున్.

మంగళమస్తు.

[అని యందఱు నిష్క్రమించుచున్నారు]

గద్యము॥ ఇది శ్రీకాశికశ్రీనివాసాచార్యతనూభవ వీరరాఘవకవినిర్మితంబగు సత్యభామాపరిణయంబగునాటకంబు సమగ్రంబు.

---

తే॥ శాలివాహనశకహకాజకసుసంఖ్య । యైనదుర్ముఖివత్సరమైనసమయ।
మునమరచియించెశబ్దశాసనవిధిజ్ఞ । కవివరుండగువీరరాఘవగురుండు॥

---

# శ్రీ సత్యభామాపరియణములోని యచ్చుతప్పుల సవరణ పట్టీ.

| పుట. | పంక్తి. | తప్పుగాముద్రితమైనది. | సవరణచేసినవిధము. |
|---|---|---|---|
| ౧ | ౨ | శేఖే | శేభే |
| ,, | ౯ | శకరం | శంకరం |
| ౨ | ౧౫ | నీకెటు | నీకెట్లు |
| ,, | ౨౭ | భావ్యుల | భావుల |
| ౫ | ౨ | నగుటంజేసి | నసుంటంజేసి |
| ,, | ౩ | మీలో | మీతో |
| ,, | ౨౧ | వేన్నెల | వెన్నెల |
| ౬ | ౨౨ | యాఖేటనాటనా | యాఖేటనా |
| ౭ | ౧ | హిమగిరితనయె! | హిమగిరితనయ ! |
| ,, | ౨౧ | లిదుగో | లిరుగో |
| ,, | ౩౦ | బొందెనె। | బొందనె। |
| ౯ | ౨ | కుండంజేయ | కుండంజేయు |
| ,, | ౫ | తాఖ్యాతు | త్యాఖ్యాతు |
| ౧౦ | ౫ | (అనఁగానిష్కృ) | అనఁగానందఋనిష్కృ) |
| ,, | ౧౫ | గాపున | గావున |
| ౧౩ | ౨౩ | శరవనిఁ | శరవణి |
| ౧౫ | ౧౫ | దామరించి | దామదించి. |
| ,, | ౧౮ | ధరాత్ముల | ధర్మాత్ముల |
| ౧౬ | ౨౬ | బోచున్నా | బోవుచున్నా |
| ,, | ౨౭ | వచ్చితి. | వచ్చితివి. |
| ౧౭ | ౧౪ | చిత్తులై | చిత్తుఁడై |
| ౧౯ | ౧౪ | దెల్పెడు | దెల్పుడు |
| ౨౨ | ౨౩ | సముదా | సాముదా |
| ౨౩ | ౧౬ | మధుస్యందనా! | మధుస్యందా! |
| ౨౪ | ౫ | విఘ్నెశ్వరుఁడు | విఘ్నేశ్వరుఁడు |

| పుట. | పంక్తి | తప్పుగాముద్రితమైనది. | సవరణచేసినవిధము. |
|---|---|---|---|
| ౨౫ | ౨ | మిడగా | మెడగా |
| ౨౭ | ౧౨ | ఊ | ఊఁ |
| ,, | ౨౬ | కర్జూర | ఖర్జూర |
| ౨౮ | ౧౪ | సుంద్రాళ్ల | సుండ్రాళ్ల |
| ౩౦ | ౪ | చూళిక | విష్కంభము |
| ౩౧ | ౧౨ | వేవిరి | వేసిరి |
| ,, | ౨౭ | విదారించి | విచారించి |
| ౩౨ | ౧౬ | విభున్ | విభుల్ |
| ౩౭ | ౧౬ | శని | చని |
| ౪౦ | ౧౧ | పాసకులనన్ను | పాసకులునన్ను |
| ,, | ౧౩ | నెక్కటి | యొక్కటి |
| ౪౪ | ౨౨ | గలిగ | గలుగ |
| ౪౫ | ౧౪ | చూళిక | మిశ్రవిష్కంభము. |
| ౪౬ | ౧౬ | సత్యకుడు-స్వామీ | సత్యకుఁడు(పరిహాసముతో) స్వామీ! |
| ౫౩ | ౨౧ | ద్రెళ్లసింగ | ద్రెళ్లెసింగ |
| ౫౫ | ౮ | మనుకుల | మనుజుల |
| ,, | ౧౫ | మన్వేషణ | మణ్యన్వేషణ |
| ౫౬ | ౬ | గన్నట్టైడు | గన్పట్టైడు |
| ౫౮ | ౧౪ | గూర్చి | గూల్చి |
| ,, | ౨౩ | రక్షన్సుర | రక్షోసుర |
| ౬౦ | ౨౦ | నిల్వడని | నిబ్వఁడని |
| ౬౨ | ౫ | లేచియుంచినను. | వేఁచియుండినను |
| ,, | ౧౭ | పునకేగె | పులకేగె |
| ౬౩ | ౨ | వింతలేలే | వంతలేలే |
| ,, | ౨౦ | లేల | నేల |
| ౭౦ | ౨౮ | గోర్త్రి | గోర |
| ౭౨ | ౧౨ | నపహరించి | నపవారించి |